# ఇంకో ప్యారీ మిఠాయి తినాలని ఆశ!




పిల్లలు ప్యారీ మిఠాయిలు ఎప్పుడూ కావాలనే అంటూ ఉంటారు. పిల్లలు అతివేగంగా కోల్పోయే శక్తిని ప్యారీ మిఠాయిలు భర్తీ చేస్తాయి. ప్యారీ మిఠాయిలు తాజావైనవి, పుష్టికరమైనవి, చప్పరించకుండా ఉండలేనంత రుచికరమైనవి.

తయారుచేయువారు: ప్యారీస్ కన్‌ఫెక్షనరీ లిమిటెడ్, మద్రాసు

PRS-6396

# ఫ్లోరైడ్ పిప్పిపళ్ళు రాకుండా కాపాడుతుంది కనీసం 50 ఏళ్ళ వయసు వరకూ

(రెడ్బెర్ మరియు ఎల్ కాక్ 1951లో చేసిన అధ్యయనము—
'సైంటిఫిక్ ఆర్టికల్స్' పేజీ 305, అనల్స్ ఆఫ్
ది రాయల్ కాలేజ్ ఆఫ్ సర్జన్స్ ఆఫ్ ఇంగ్లండ్,
నవంబర్ 1969, వాల్యూమ్ 45/నం. 5 నుండి)

## అందుకే బినాకా వారు తయారు చేసే టూత్‌పేస్ట్‌లో ఫ్లోరైడ్ ఉంటుంది

ఎందువల్లనంటే బినాకా ఫ్లోరైడ్‌లో గల సోడియమ్-మోనో-ఫ్లోరో-ఫాస్ఫేట్ (యస్‌యమ్‌ఎఫ్‌పి) వలన దంత రక్షణే గాక, పిప్పి పళ్ళను పెద్దదవకుండా చేస్తుంది: పంటి ఎనామిల్ గట్టిపరుస్తుంది. నోటిలో తయారయ్యే ఏసిడ్ తయారు కాకుండా చేస్తుంది. దంతక్షయాన్ని అరికట్టుతుంది. బినాకా ఫ్లోరైడ్ వాడకానికి బలమైన కారణాలు ఇవన్నీ. రోగ నివారణకన్నా అరికట్టడం మేలని నిప్పే టూత్ పేస్ట్ ఇది.






బినాకా ఫ్లోరైడ్‌తో దంతక్షయాన్నుంచి, బాధించే పిప్పి పళ్ళ నుంచీ మూడు రకాలుగా రక్షణ లభిస్తుంది.

CIBA Cosmetics

CF. 31 TL




కథ-దర్శకత్వం కె.బాలచందర్ రచన భమిడిపాటి రాధాకృష్ణ సంగీతం గోవర్ధన్ కెమెరా బాలకృష్ణ



ఏమా తృప్తి! ఏమా వింత!
టానిక్ ఏదైనా ఆకలిని మాత్రమే
పెంచగలిగితే అది సగం పనిని మాత్రమే చేసినట్లు అవుతుంది
ఇన్‌క్రీమిన్ ఇవ్వండి... అది అధిక ఆహారమును అధిక పెరుగుదలగా మారుస్తుంది.
Incremin drops LYSINE-VITAMINE
ఇన్‌క్రీమిన్* టానిక్
పెద్ద పిల్లలకు (ఐరన్‌తో కూడిన)
ఇన్‌క్రీమిన్ సిరప్—175 మి.లీ. & 57 మి.లీ.
పసి బిడ్డలకు 10 మి.లీ. ఇన్‌క్రీమిన్ డ్రాప్స్
ఇన్‌క్రీమిన్ దళంలో చేరండి...
పెరుగుదల నిచ్చు ఆకలి పొందండి!
అన్ని మందుల షాపులలో లభించుచున్నది
* అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిష్టర్డ్ ట్రేడ్ మార్కు
లింటాస్ — INC. 20-537 TL



Lederle



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

ఈ సంచికలో "గుణం ప్రధానం" [బేతాళ కథ] పంపినవారు ఎస్. ఉమా మహేశ్వరరావు.

"రత్నాల చెట్లు" అన్న కథలో, మనిషి గౌరవం పొందటానికి తెలివి తేటలకన్న డబ్బు ఎలా ప్రధానమవుతుందో, డబ్బు గలవాడి మాటలలో లేని తెలివితేటలు కూడా ఉన్నట్టు ఎలా భ్రమ కలుగుతుందో మనం చూస్తాం.

"కీర్తికి దారి" అన్న కథలో కూడా డబ్బు వంచకులను ఎలా ఆకాశాని కెత్తేదీ చూడవచ్చు.

సంపుటి 49 అక్టోబర్ '71 సంచిక 4

CHITRA



# అమరవాణి

గిరౌ మయూరా గగనే పయోదా,
లక్షాంతరే ర్కశ్చ జలేషు పద్మం,
ఇందు ర్ద్విలక్షం కుముదస్య బంధుః,
యో యస్య మిత్రం నహి తస్య దూరం 1

[స్నేహానికి దూరం లేదు. కొండల మీది నెమళ్ళకూ, ఆకాశాన మేఘానికి స్నేహం; "లక్ష" దూరాన ఉన్న సూర్యుడికీ, నీటిలోని పద్మాలకూ స్నేహం; "రెండు లక్షల" దూరాన ఉన్న చంద్రుడు కలవలకు ఆప్తుడు.]

ఉపచారః కర్తవ్యో యావ దనుత్పన్న సౌహృదాః పురుషాః,
ఉత్పన్న సౌహృదానా ముపచారః కైతవం భవతి 2

[స్నేహం ఏర్పడేదాకా మర్యాద అవసరం. స్నేహం కలిగిన తరవాత చేసే మర్యాద అమర్యాద అవుతుంది.]

స్నేహో హి వర మఘటితో, న వరం సంజాతవిఘటితస్నేహః,
హృతనయనో హి విషాదీ, న విషాదీ భవతి జాత్యంధః 3

[కళ్ళు ఉండి పోగొట్టుకున్నవాడిది బాధ గాని, పుట్టుగుడ్డివాడికి బాధ లేదు. అలాగే, స్నేహం చెడడం కన్న; స్నేహం కలగకుండా ఉండటం ఎంతో మేలు.]



2



# లలాట రేఖ

ఒక భక్తుడు బ్రహ్మను గురించి గొప్ప తపస్సు చేస్తూ వచ్చాడు. ఒకనాడు బ్రహ్మ దేవుడు ఆనాడు పుట్టిన బిడ్డల కందరికీ నుదిటి మీద వారి విధి లిఖించి వస్తూ, దారిలో ఈ భక్తుణ్ణి చూసి ముచ్చటపడి, అతని ముందు ప్రత్యక్షమై, "నాయనా, నీ భక్తికి మెచ్చాను," అన్నాడు

భక్తుడు బ్రహ్మను చూసి పరమానందం చెంది, "దేవా, నీ దర్శనం చేత నా జన్మ తరించింది. నేను ధన్యుణ్ణి అయాను," అన్నాడు.

"వత్సా, నీకు దర్శనం ఇచ్చి ఊరికే వెళ్ళటం భావ్యం కాదు. ఏదైనా వరం కోరుకో," అన్నాడు బ్రహ్మ.

బ్రహ్మను ఏమి వరం కోరాలో భక్తుడికి చప్పున స్ఫురించలేదు. బ్రహ్మ అంత త్వరగా తనకు ప్రత్యక్షమవుతాడని అతను అనుకోలేదు.

భక్తుడి మౌనం చూసి బ్రహ్మ, "కోరుకునేటందుకు నీకు వర మేమీ లేదా?" అని అడిగాడు.

అప్పుడు భక్తుడికి ఒక ఆలోచన వచ్చింది. తనకు కలగబోయే సంతానానికి జీవితం సుఖసంతోషాలతో గడిచిపోతే అంతే చాలు.

ఇలా అనుకుని భక్తుడు, "దేవా, నా బిడ్డల అదృష్టరేఖ నా చేతి మీదుగానే రాసే వరం నాకు ప్రసాదించు," అని బ్రహ్మను వేడుకున్నాడు.

బ్రహ్మదేవుణ్ణి ఇలాటి వరం పూర్వం ఎన్నడూ ఎవరూ అడిగి ఉండలేదు. ఇది కాక మరేదన్నా వరం కోరుకోమందామని బ్రహ్మ అనుకున్నాడు. కాని, వరం కోరుకోమని, కోరుకున్నాక ఇవ్వననటం భావ్యంగా ఉండదేమోనని బ్రహ్మకు అనిపించింది. అందుచేత ఆయన మౌనంగా ఉండి పోయాడు.

సి. వెంకటాచారి

భక్తుడు మటుకు తన అభిప్రాయం మార్చుకోక, బ్రహ్మ యొక్క జవాబు కోసం ఎదురు చూస్తున్నాడు.

చిట్టచివరకు బ్రహ్మ, "అలాగే కానీ!" అని అంతర్థాన మయాడు.

భక్తుడు పరమానంద భరితుడై, తపస్సు చాలించి, ఇంటికి తిరిగి వచ్చాడు. కొంత కాలం గడిచింది. భక్తుడికి ఒక కొడుకు పుట్టాడు. తన వరం సఫలం చేసుకునే అవకాశం దొరికినందుకు భక్తుడు ఎంతగానో సంతోషిస్తూ, బ్రహ్మను ధ్యానించి, "దేవా, నా కొడుకు అదృష్టరేఖ నా చేతి మీదుగా రాయటానికి అధికారం ప్రసాదించు," అని ప్రార్థించాడు.

బ్రహ్మ తిరిగి ప్రత్యక్షమై, "అలాగే చెయ్యి!" అంటూ తన కిరీటం భక్తుడి శిరస్సున ఉంచాడు.

కాని మరుక్షణమే ఒక వింత జరిగింది. భక్తుడు తన కొడుకు నుదిటి మీద అదృష్ట రేఖలు లిఖించబోయేటంతలో అతని ముందు అప్పుడే పుట్టిన శిశువులు అసంఖ్యాకంగా కనిపించారు. వారందరూ తమ అదృష్టరేఖలు తనను లిఖించమంటున్నట్టు భక్తుడికి అర్థమయింది. వారిలో తన కొడుకు ఎవరైనదీ పోల్చుకోవటం అతనికి అసాధ్యమయింది.

భక్తుడికి మతి పోయింది. అతను తన ఎదట శిశువుల సంఖ్య పెరిగిపోతూ వుండటం చూసి కంగారు పడి, "దేవా, వీరిలో నా బిడ్డ ఎవరో చెప్పండి," అని కేకపెట్టాడు.

పక్కనే ఉన్న బ్రహ్మ భక్తుడితో, "పిచ్చివాడా, నువు నా పని చేపట్టావు. నీ కిప్పుడు నీ బిడ్డా, ఇతరుల బిడ్డా అన్న వ్యత్యాసం ఎలా వుంటుంది? నా కిరీటాన్ని ధరించి నువు నా సంతానం మధ్య నీ పిల్లవాణ్ణి వెతకటం అవివేకం," అని తన కిరీటాన్ని భక్తుడి తల మీది నుంచి తీసివేశాడు.

భక్తుడికి ఇప్పుడు తన పిల్లవాడు మాత్రమే కనిపించాడు. అయితే అతడికి, వాడి నుదుట భాగ్యరేఖ లిఖించే శక్తి నశించింది.





# రత్నాల చెట్లు

ఒక నగరంలో చంద్రగుప్తుడు అనే రత్న వర్తకుడు ఉండేవాడు. ఆయన ఏడాదికి ఆరుమాసాలు సముద్రం మీద ప్రయాణం చేసి, దేశాంతరాల నుండి మేలు రకాల రత్నాలు తెచ్చి, వాటిని రాజులకు విక్రయించేవాడు.

చంద్రగుప్తుడికి లేకలేక ఒక కుమారుడు కలిగాడు. అతనికి ధనరాజు అని పేరు పెట్టుకున్నారు. ధనరాజు ఏడాదివాడై వుండగా అతని తల్లి మరణించింది. సవతితల్లి అయితే తన కొడుకును సరిగా చూడదనుకుని చంద్రగుప్తుడు తిరిగి పెళ్ళాడక, తానే ధనరాజుకు తల్లీ, తండ్రీ అయి వాణ్ణి ఎంతో శ్రద్ధతో పెంచి, పెద్దవాణ్ణి చేశాడు. ఈ కారణంచేత ఆయన సముద్ర ప్రయాణాలు కట్టిపెట్టి, ఇంటి వద్దనే ఉండిపోవలసి వచ్చింది. ఆయన చేసే రత్నవర్తకం కూడా నిలిచిపోయింది.

తండ్రి పెంపకంలో ధనరాజు అర్భకంగానూ, అమాయకంగానూ పెరిగాడు. అతనికి చదువు అంతగా వంటబట్టలేదు. తెలివితేటలు చాలా సామాన్యంగా ఉండేవి. లౌక్యం గాని, గడుసుతనం గాని ఆ కుర్రవాడిలో కొంచెం కూడా కనిపించేవి కావు.

కొడుకును చూస్తుంటే చంద్రగుప్తుడికి విచారం కలిగేది. తన అనంతరం వాడు ఎలా పైకి వస్తాడా అన్న విచారం ఆయనను పీడించసాగింది. దీనికి తోడు వార్ధక్యం కూడా మీద పడింది.

ధనరాజుకు ఇరవైఏళ్ళు నిండేసరికి చంద్రగుప్తుడు మంచాన పడ్డాడు. ఇంతకాలమూ వర్తకం సాగకపోవటం చేత సంపాదించిన ధనమంతా ఖర్చు అయిపోయింది.

తాను త్వరలోనే చనిపోతానని అనిపించి చంద్రగుప్తుడు తన కొడుకును పిలిచి, "నాయనా, నువు పుట్టక పూర్వం నేను

ప్రహరాజు హేమలతాదేవి



మంచి ధనవంతుణ్ణి. కాని ఇవాళ మనం సామాన్య కుటుంబీకులం. మనకు ఇప్పు డీ ఇల్లు గాక, నేను దాచినవి పది రత్నా లున్నాయి. నా చిన్ననాటి స్నేహితుడైన కేశవగుప్తుడి సహాయంతో ఈ రత్నాలను అమ్మి, అతని అండన ఏదన్నా చిన్న వ్యాపారం ప్రారంభించి బాగుపడు. కేశవ గుప్తుడి కూతురు కుముదిని ఉన్నది గదా. మీ రిద్దరూ చిన్నతనం నుంచీ ఒకరిని ఒకరు ఎరుగుదురు. నువు ఆమెను పెళ్ళాడా వంటే, నిన్ను కేశవగుప్తుడు అన్ని విధాలా కనిపెట్టుకుని ఉంటాడు. నీకేలోటూ రాదు,'' అని చెప్పి, ధనరాజు చేతిలో పది రత్నాలు పెట్టి, కన్ను మూశాడు.

తండ్రికి ఉత్తరక్రియలు జరిపి, ధన రాజు కేశవగుప్తుడి ఇంటికి రత్నాలు తీసుకుని వెళ్ళాడు. కేశవగుప్తుడు అతన్ని ఎంతో ఆదరించి, చంద్రగుప్తుడి చావుకు తన సంతాపం తెలిపి, ''మీ నాన్న నాకు చిన్ననాటి స్నేహితుడు. నీకు నా వల్ల ఏమి సహాయం కావలసినా సంకోచించకుండా అడుగు,'' అన్నాడు.

ధనరాజు కేశవగుప్తుడికి రత్నాలు చూపి, ''ఇప్పుడు నాకు మిగిలిన చరాస్తి ఈ రత్నాలే. వీటిని మీరు తీసుకుని వెల ఇప్పిస్తే, మీ సహాయంతో వ్యాపారం చేసుకుని వృద్ధిలోకి వచ్చి, మీ అమ్మాయి కుముదినిని పెళ్ళాడి సుఖంగా ఉంటాను,'' అన్నాడు.

అమాయకుడైన ధనరాజు ఇలా అనే సరికి కేశవగుప్తుడికి మండిపోయింది. ఒకప్పుడు కేశవగుప్తుడు చంద్రగుప్తుడంత ధనవంతుడు కాడు. కాని అతడు విడవకుండా వర్తకం సాగించి, ప్రస్తుతం చాలా గొప్ప స్థితిలో ఉన్నాడు. చిన్ననాటి స్నేహితుడి కొడుకు గదా, సహాయం చేదామనుకుంటే, ధనరాజు తన కూతుర్ని పెళ్ళాడి, తన ఆస్తి కాజెయ్యాలన్న దురాశతో ఉన్నట్టు కేశవగుప్తుడికి తోచింది.

ఆయన ధనరాజుతో, ''దుర్మార్గుడా, నీ కడుపులో ఇంత దురాలోచన ఉన్నదా?

ఈ ముష్టిరత్నాలకు వెలాలేదు, గిలాలేదు. వీటిని పాతిపెడితే రత్నాలచెట్లు మొలిచి, మరిన్ని రత్నాలు కాస్తాయి. అప్పుడు వచ్చి వెల అడుగు!'' అంటూ ఆ రత్నాలను ధనరాజు మొహానే కొట్టి, తన నౌకర్ల చేత ఆ కుర్రవాణ్ణి ఇంటి నుంచి వీధిలోకి గెంటించాడు.

కేశవగుప్తుడి ప్రవర్తన ధనరాజుకు ఏమీ అర్థం కాలేదు. ఆయన అన్న మాటలలో అతనికి అర్థమయినది ఏమంటే, రత్నాలు పాతేస్తే రత్నాల చెట్లు మొలిచి, రత్నాలు కాస్తాయని.

ధనరాజు కేశగుప్తుడి ఇంటి నుంచి తన ఇంటికి వస్తూండగా దారిలో అతనికి, తనతో కలిసి చదువుకున్న రంగనాథు డనేవాడు ఎదురుపడి, పలకరించి, ధనరాజు విచారంగా వుండటానికి కారణం ఏమిటో అడిగి తెలుసుకున్నాడు.

అంతా చెప్పి ధనరాజు, "రత్నాలు పాతిపెడితే నిజంగా చెట్లు మొలిచి, రత్నాలు కాస్తాయా?'' అన్నాడు రంగనాథుడితో.

ఇలాంటి అమాయకుణ్ణి మోసం చేసి ఆ రత్నాలు కాజేయాలని నిశ్చయించుకుని రంగనాథుడు, "ఎందుకు మొలవవూ? దాని కొక మంత్రమూ, ఒక తంత్రమూ ఉన్నది. ఆ మంత్రమూ, తంత్రమూ నాకు తెలుసు. రత్నాలను అర్థరాత్రి వేళ నాటాలి.



నీ కెందుకు శ్రమ? అంతా నేను చేసి పెడతాలే,'' అన్నాడు.

''ఆ మంత్ర మేదో నాకు చెప్పరాదా?'' అని ధనరాజు అడిగాడు.

"అమ్మయ్యో, ఆ మంత్రం ఇతరులకు చెప్పేస్తే నా తల పగిలిపోతుంది. ఇవాళ అర్థరాత్రికి నేను వస్తాను కద!'' అన్నాడు రంగనాథుడు.

ఆ రాత్రి రంగనాథుడు ధనరాజు ఇంటికి వచ్చి, రత్నాలు తెమ్మని తీసుకుని, ''వీటిని మంత్రోక్తంగా నీ దొడ్లో పాతేస్తాను. కొద్ది రోజులలో మొక్కలు మొలుస్తాయి. ఆ మొక్కలు అచ్చంగా తోటకూర మొక్కల్లా ఉంటాయి. అవి పెరిగాక, అర్థరాత్రి పూటే

నువు వాటిని తవ్వి, వాటి వేళ్ళకు ఉండే రత్నాలు తీసుకో," అన్నాడు.

ఆ దుర్మార్గుడు ఒంటరిగా ధనరాజు దొడ్లోకి వెళ్ళి, కొంత మేర తవ్వి, తోటకూర గింజలు వేసి, రత్నాలు కాజేసి వెళ్ళిపోయాడు. వాడు మర్నాడే దేశం విడిచి ఎటో వెళ్లాడు.

ధనరాజు దొడ్లో తోటకూర స్తంభాలు మొలిచి, నెల రోజులకు ఏపుగా పెరిగాయి. అవే రత్నాలచెట్లు కాబోలునని ధనరాజు అనుకున్నాడు.

అవి పెరగటం పూర్తి అయిందని తోచ గానే ధనరాజు ఒకనాటి అర్ధరాత్రి గునపం తీసుకుని తోటకూర స్తంభా లన్నిటినీ వేళ్ళతో సహా తవ్వి తీశాడు. వాటి వేళ్ళకు రత్నాలు లేవు. మడి అంతా ఇంకా లోతుగా తవ్వాడు. అప్పటికీ మణుల జాడ ఎక్కడా కనిపించలేదు.

ధనరాజు నిరాశ చెందక ఇంకా లోతు తవ్వాడు. ఒక చోట గునపానికి ఏదో తగిలి ఖంగుమన్నది.

ధనరాజు దాన్ని తవ్వి పైకి తీశాడు. అది ఒక ఇత్తడి పెట్టె. దాని మూత తీసి చూస్తే దాని నిండా వజ్రాలూ, వైడూర్యాలూ ఉండి, ధగధగా మెరుస్తున్నాయి. ధనరాజు కోరిక ఈడేరింది.

మర్నాడు అతను ఆ రత్నాలను తీసుకుని కేశవగుప్తుడి దగ్గిరికి వెళ్ళి, "ఈ రత్నాలకు వెల కట్టండి!" అన్నాడు.

వాటిని చూసి కేశవగుప్తుడు నిర్ఘాంత పోయి, "ఇన్ని రత్నాలే! నాయనా, వీటిని ఎక్కడ సంపాదించావు? ఏం వ్యాపారం చేశావు?" అని అడిగాడు.

"మీరు చెప్పారు గద? రత్నాలను పాతి పెట్టి, రత్నాల చెట్లు పెంచి, వాటికి కాయించాను," అన్నాడు ధనరాజు.

కేశవగుప్తుడు ఆ కుర్రవాడు తనను హేళన చేస్తున్నాడనుకుని, ఆనాడు అలా మాట్లాడినందుకు సిగ్గుపడి, ధనరాజు ఇప్పుడు తన కంటె కూడా ధనికుడే గనక, తన కుమార్తెను అతని కిచ్చి పెళ్ళి చేసి, తన వద్దనే ఉంచుకున్నాడు.






## 13

[జీవదత్తుడు ద్వంద్వయుద్ధంలో వసుమతిని ఓడించాడు. వసుమతి అతడికీ, ఖడ్గ వర్మకూ తన భవనంలో అతిథ్యం ఇచ్చాడు. తరవాత వాళ్ళు గండ్రగొడ్డలి యువ కుణ్ణి వెంటబెట్టుకుని చెట్టుతొర్రను చేరారు. చెట్టు కింద మహేంద్రనగరం సేనాని కొడుకు కాపువేసి వున్నాడు. అది చూసి ఖడ్గవర్మ కత్తి దూశాడు. తరవాత—]

మహేంద్రనగర సేనాని కొడుకు తన సైని కులకు యిచ్చిన అజ్ఞ వింటూనే జీవదత్తుడు ఖడ్గవర్మను హెచ్చరించబోయాడు. కాని ఖడ్గవర్మ కత్తి దూసి తొర్రలోంచి బయటికి వెళ్ళాలన్న ప్రయత్నంలో చప్పున ముందుకు దూకబోయాడు. జీవదత్తుడు అతడి కాలొకటి పట్టుకుని వెనక్కు గుంజి, "ఖడ్గా, అగు! ఉపాయంతో శత్రువులను జయించే అవకాశం వున్న చోట మనం తొందరపడి ముఖాముఖి యుద్ధానికి పూను కోవటం ప్రమాద కారణం అవుతుంది. సేనాని కొడుకు వెంట ముప్పై నలభై మంది సైనికు లున్నట్టున్నది. ఈ తొర్రలోంచి మనం ఒకళ్ళ వెనక ఒకళ్ళం భూమి మీదికి దిగేలోపలే మన అంతు వాళ్ళు తేలు స్తారు!" అన్నాడు.

ఖడ్గవర్మ వెంటనే వెనక్కు తిరిగి చిన్న గొంతుతో, "నువ్వన్నది నిజమే కావచ్చు.




కాని, వాళ్లు ఎలానూ చెట్టెక్కబోతున్నారు. ఈ తొర్రలో వున్న మనం తప్పక వాళ్ళ కంటబడి తీరుతాం!'' అన్నాడు.

''మనం వాళ్ళ కంటబడకుండానే, వాళ్ళకు హడలెత్తించి పారదోలే ఉపాయం వున్నది. అది సాధ్యం కాకపోతే, అప్పుడు కిందకి దిగి శత్రువులను ఎదుర్కొందాం. ఏదీ నీ కత్తి ఇటివ్వు!'' అన్నాడు జీవదత్తుడు చేయిచాచి.

ఖడ్గవర్మ కొంచెం ఆశ్చర్యపోయి కత్తిని జీవదత్తుడి కిచ్చాడు. జీవదత్తుడు తన పక్కనే వున్న వసుమతి బావమరిదిని గండ్రగొడ్డలి ఇవ్వమన్నాడు. అతడు మాట్లాడకుండా గొడ్డలిని ఇచ్చేశాడు. జీవదత్తుడు గొడ్డలినీ, కత్తినీ కలిపి కట్టి, దానికి వసుమతి తనకు బహూకరించిన కంచుఢక్కను వేల్లాడకట్టాడు.

''ఏమి టిదంతా?'' అన్నాడు ఖడ్గవర్మ.

''ఈ చెట్టుతొర్రలో శిలాశిఖి మహాముని తపస్సు చేసుకుంటున్నాడు! తపోభంగం కలిగిస్తే, ఈ అయుధాలతో అయన శిష్యుడు శత్రువులను చిత్రవధ చేస్తాడు. సరే, నువ్వు వెనక్కు పోయి, గుహ ద్వారం పక్కన రాళ్ళు పగిలి ఏర్పడిన కంత వున్నదే—దాని నుంచి బయటికి వెళ్ళి, మరొక చెట్టు ఎక్కి నాలుగైదు నిమిషాల్లో, యీ సైనికుల మూక పారిపోకపోతే, యీ సంగతి హెచ్చరిస్తూ, మొదటి బాణం మహేంద్రనగరం సేనాని కొడుక్కు తగిలేలా కొట్టు!'' అన్నాడు జీవదత్తుడు.

ఖడ్గవర్మ చెట్టుతొర్ర వెంట వెనక్కు పాకిపోయాడు. జీవదత్తుడు తాను కలిపి కట్టిన ఆయుధాలతో తొర్ర ముఖద్వారం కేసి కదిలాడు. వసుమతి బావమరిది అతడి భుజం పట్టుకుని చిన్న గొంతుతో, ''ఇంత పెద్ద ప్రయత్నం ఎందుకు? మా బావగా రిచ్చిన కంచుఢక్క మోగిస్తే, ఆ సైనికు లంతా పారిపోతారు గదా?'' అన్నాడు.

''ఆ సంగతి నాకు గుర్తుంది. కాని ఆ ఢక్కలో మీ బావగారు చెప్పిన మహత్తు లేకపోతే, ఎవడో బుడబుక్కలవాడు యిక్క

దున్నా డనుకుని, సేనాని కొడుకు మరింత ధైర్యంతో మన మీదికి వచ్చి పడతాడు. కంచుఢక్కా మహత్తును పరీక్షించే సమయం యిది కాదు," అన్నాడు జీవదత్తుడు.

తరవాత జీవదత్తుడు తొర్ర ముందుకు పోయి, తల బయటికి పెట్టకుండా ఆయుధా లున్న చేతిని మాత్రం బయటికి చాచి, దాన్ని కిందికీ పైకీ రెండుమూడు సార్లు గట్టిగా వూపాడు.

హఠాత్తుగా చెట్టు తొర్రలోంచి గండ్ర గొడ్డలి, కత్తీ, కంచుఢక్కా పట్టుకున్న చేయి ఒకటి బయటికి రావటం చూసి, సేనాని కొడుకూ, అడవి సైనికులూ హడలిపోయారు.

"చెట్టుతొర్రలో ఎవడో రాక్షసు డున్నాడు! ప్రాణాలు దక్కించుకుని పారిపోదాం!" అంటూ అయిదారుగురు సైనికులు వెనక్కు తిరిగారు. వాళ్ళను చూసి తతిమ్మా సైని కులు కూడా పారిపోబోయారు.

సేనాని కొడుకు, "ఆగండి!" అంటూ పెద్దగా అరిచి, "అంత ధగధగ లాడుతున్న ఆ ఆయుధాలు రాక్షసుడివై వుండవు. రాక్షసు డంటే పచ్చిమాంసం తినేవాడు కదా? అలాంటివాడి ఆయుధాలు రక్తం ఓడుతూ, తుప్పుపట్టి వుంటవి!" అన్నాడు.

"అయ్యా, మీ రన్నదాంట్లో వున్న సత్యా సత్యాలు బయట పడేలోపలే మనం హతం అయిపోయే ప్రమాదం వున్నది. ఆ ద్రోహులు ఖడ్గవర్మా, జీవదత్తుడూ యిక్కడ లేరని రుజువై పోయింది గదా! పారిపోవటం క్షత్రియుల లక్షణం కాదు గనక, త్వరగా





వెనక్కు తిరిగి పోదాం రండి!" అన్నా డొక చిన్న దళనాయకుడు.

సేనాని కొడుకు ఒక క్షణకాలం తట పటాయించాడు. చెట్టుతొర్రలోంచి మాటా పలుకూ లేకుండా, హఠాత్తుగా అన్ని ఆయు ధాలు కట్టకట్టుకుని మరీ బయటికి రావటం ఏమిటి? ఇందులో ఏమైనా మోసం వున్నదా? లేక నిజంగానే....

సేనాని కొడుకు యిలా ఆలోచిస్తూన్నం తలో దూరంగా వున్న ఒక మహావృక్షం కొమ్మల్లోంచి ఒక కంచుకంఠ ధ్వని యిలా వినిపించింది: "ఒరే, క్షుద్రమానవులారా! వెంటనే యిక్కణ్ణించి పారిపొండి! ఆ చెట్టు తొర్రలో శిలాశిఖి మహాముని తపస్సు చేసు కుంటున్నాడు. తపోభంగం కలిగించారో మిమ్మల్ని భస్మం చేసేస్తాడు!"

"అదెక్కడో విన్న గొంతుక!" అంటూ సేనాని కొడుకు, ఆ మాటలు వచ్చిన వైపుకు తల తిప్పాడు. మరుక్షణం ఒక బాణం రివ్వుమంటూ వచ్చి అతని డొక్కను రాచుకుంటూ పోయి నేలలో గుచ్చుకున్నది.

సేనాని కొడుకు ఎగిరి ఒక గంతు వేసి, "కాస్తలో తప్పింది! అందరూ నా వెనగ్గా పరిగెత్తి రండి!" అన్నాడు.

"మహాముని శిష్యు డెవడో మన నాయ కుణ్ణి పగబట్టినట్టుంది. అందువల్ల ఆయన వెనగ్గా కాక, కాస్త దూరంగా పక్కన పడి పోవటం క్షేమం!" అంటూ ఒక సైనికుడు వెనక్కు తిరిగి పరుగుతీశాడు. అందరూ అతడి వెనకపడి పారిపోసాగారు.

నాలుగైదు నిమిషాల తర్వాత ఖడ్గవర్మ చెట్టు దిగి జీవదత్తు డున్న చోటుకు వచ్చాడు. గంధ్రగొడ్డలి యువకుడు ఖడ్గవర్మను గొప్పగా మెచ్చుకుంటూ, "ఈ దెబ్బతో నరమానవుడైన వాడెవడూ యీ చెట్టుతొర్ర ప్రాంతానికి రాడు. ఆ సేనాని కొడుకును ఎందుకు పోనిచ్చావ్? బాణం గుండెలను తాకేట్టు కొట్టవలసింది," అన్నాడు.

"నా మాటల ధాటికే బెదిరి పారిపోయే వాడిని చంపటం ధర్మం అనిపించుకోదు. కావాలంటే యీ శిలాశిఖి మహామునిని

అడుగు!" అన్నాడు ఖడ్గవర్మ నవ్వుతూ జీవదత్తుణ్ణి చూపించి.

జీవదత్తుడు కూడా ఆ మాటలకు నవ్వి, "ఇక మనం బయలుదేరుదాం. ఆ చవట వెధవలు పారిపోయింది పడమటి దిక్కు కేసి గనక, మనం నిశ్చింతగా ఉత్తర దిక్కు కేసి పోవచ్చు. మనం చేరవలసిన పర్వతాలు ఆ దిక్కునే వున్నవి కదా!" అన్నాడు.

తరవాత ఖడ్గ జీవదత్తులు చెట్టుతొర్ర నుంచి కిందికి దిగారు. గండ్రగొడ్డలి యువకుడు కూడా వాళ్ళ వెంట దిగబోయాడు కాని, జీవదతుడు అతణ్ణి వారించి, "ఇక ఏ నాడూ పనికట్టుకుని యీ చెట్టు చుట్టూ పహరా తిరక్కు. రహస్యం బయటపడి పోయిందంటే, మీ బావగారి మిట్టకోట మీదికి ఏ రాజో దాడిచేయవచ్చు. అదంతా మీ బావగారికి లేనిపోని శ్రమకూ, అనవసర రక్తపాతానికీ కారణం అవుతుంది!" అన్నాడు.

"సలహా బాగానే వుంది, మరి నాకు కాలక్షేపం జరిగేదెట్లా?" అన్నాడు యువకుడు.

"కాలక్షేపం కావలసివస్తే, నువ్వో మరో గుట్టకోట కట్టుకుని, నచ్చిన పిల్ల నెవర్నయినా పెళ్ళాడి, హాయిగా కాలక్షేపం చెయ్యి. మేం వింధ్యపర్వతాల నుంచి తిరిగి పద్మపురం వెళ్ళేప్పుడు నిన్ను కలుసుకుంటాం. ప్రస్తుతానికి శెలవు!" అన్నాడు జీవదత్తుడు.



ఖడ్గ జీవదత్తులు అక్కణ్ణించి బయలుదేరి అరణ్యమార్గాల వెంట ప్రయాణిస్తూ, సూర్యాస్తమయానికి యింకా ఒక గంట కాలం వున్నదనగా, ఒక నీటివాగును చేరారు. ఇద్దరూ ఆ వాగులోని స్వచ్ఛమైన నీరు తాగి, కాళ్ళూ చేతులూ కడుక్కుని, ఒక చెట్టు కింద కొద్ది సేపు విశ్రాంతి తీసుకుని, సూర్యాస్తమయం లోపల ఎదురుగా వున్న చిన్న కొండ ప్రాంతాన్ని చేరాలన్న నిశ్చయంతో, వాగు దాటి ముందుకు నడిచారు.

ఖడ్గ జీవదత్తులు వాగు దగ్గిరకు వచ్చి నప్పటి నుంచీ, వాళ్ళు చేసే ప్రతిపనినీ, అవతల వున్న చెట్ల మీది నుంచి ఇద్దరు సైనికులు జాగ్రత్తగా గమనిస్తున్నారు. వాళ్లు



ఆనందపురం రాజుగారి సైనికులు. ఆ రాజు ఒక ఇరవైమంది సైనికులను వెంట బెట్టుకుని, రథం ఎక్కి అరణ్యానికి వేటకు వచ్చాడు. ఆ అరణ్యం అతడి రాజ్యభాగం లోదే అయినా, ఒకానొక పూజారి నుంచి అతడికి నాలుగైదు నెలలుగా, ప్రమాదం రావచ్చున్న భయం పట్టుకున్నది. అందుచేత అతడు తాను వేటాడే ప్రాంతాల చుట్టుపక్కల కొందరు వేగులవాళ్ళను చెట్ల పైన వుంచి, నీటివాగు పరిసరాలను కాపలా కాయిస్తున్నాడు.

ఈ ఆనందపురం రాజు పేరు నిత్యానందుడు. అతడి శత్రువైన పూజారి పేరు విఘ్నేశ్వరపూజారి. చాలా వింత పరిస్థితుల కారణంగా వాళ్ళిద్దరి మధ్యా బద్ధవైరం ఏర్పడింది.

విఘ్నేశ్వరపూజారి ఆనందపురం వెలపల వున్న ఒక అతిప్రాచీన విఘ్నేశ్వరాలయంలో పూజారిగా వుంటూండేవాడు. ఇప్పటికి అయిదారు నెలలక్రితం, వినాయక చవితి పండగ మరోవారం రోజులు వున్నదనగా, అతడికి ఒక రాత్రివేళ ఒక కల వచ్చింది. ఆ కలలో రాజు వినాయకచవితి నాటి మిట్టమధ్యాహ్నం వేళ కాలినడకన ఆలయానికి వచ్చి, తన తల మీద వున్న కిరీటాన్ని తీసి స్వయంగా పూజారి నెత్తిన పెట్టి, "ఆనందపురాన్ని పాలించే అర్హత నీకు తప్ప మరెవరికీ లేదు. వెళ్ళి సింహాసనాన్ని అధిష్ఠించు! నేను అరణ్యాలకు పోయి, ఆకలములు తింటూ శేషజీవితాన్ని గడిపేస్తాను!" అన్నాడు.

పూజారికి వెంటనే మెలుకువ వచ్చింది. కిరీటం కోసం తలమీద తడివి చూసుకున్నాడు. అక్కడ కిరీటం లేదు. "ఓహోఁ, వినాయకచవితి రోజున గదా, రాజు నా తల మీద కిరీటం పెట్టనున్నది! దానికి యింకా వారంరోజులు గడువుంది!" అనుకుని తృప్తిపడ్డాడు.

ఈ విఘ్నేశ్వరిపూజారికి కొంచెం మూఢత్వంతో పాటు, అహంకారం కూడా వున్నది. ఆలయానికి వచ్చినప్పుడల్లా రాజు

తనకు తలవంచి నమస్కరించటం, తనలో ఏదో గొప్ప చూసి అని భ్రమపడుతూండే వాడు. దానికితోడు యీ వింత కల రావటంతో, అతడిలోని అహంకారం మరింతగా బలిసిపోయింది.

ఆ కన్న కల నిజం అయి తీరుతుందనుకున్న విఘ్నేశ్వర పూజారి ఆ మరసటి రోజునే కంసాలి చేత ఇత్తడి కిరీటం ఒకటి చేయించుకుని, దాన్ని తలమీద పెట్టుకుని తిరగసాగాడు. ఈ సంగతి రాజుకు ఎవరో చెప్పారు. రాజు మండిపడి అతణ్ణి సభకు పిలిపించి, నలుగురి మధ్యా గట్టిగా కోప్పడి, "ఈ పిచ్చి పనంతా ఏమిటి ?" అని అడిగాడు.

"రాజా, మీ రెలాగూ వినాయకచవితి రోజున విఘ్నేశ్వరాలయానికి వచ్చి, నా తల మీద బంగారు కిరీటం పెట్టి రాజ్యాధికారం అప్పగించనున్నారు కదా! అందుకని, యీ నాలుగు రోజులపాటూ యీ ఇత్తడి కిరీటం పెట్టుకుని — కిరీటధారణ అలవరుచుకుంటున్నాను. విఘ్నేశ్వరాలయంలో కన్న కల అబద్ధం అయే అవకాశం లేదు గదా!" అన్నాడు పూజారి.

రాజు ఆ మాటలతో మరింతగా మండిపడి అతణ్ణి భటుల చేత నాలుగు కొట్టించి, తన రాజ్యం నుంచి తరిమేశాడు. పూజారి, తన మిత్రుడైన కంసాలితో కలిసి ఆనందపురరాజ్య సరిహద్దుల్లో వున్న ఒక వాగు దాటి, ఆ పరిసరాల్లోని కొండ ప్రాంతాలు చేరాడు. అతడక్కడ కొందరు అటవికుల్ని కూడ గట్టుకుని ఆనందపుర రాజ్య సరి



హద్దుల్లో చిన్న చిన్న దాడులు ప్రారంభిం చాడు. ఇందులో అతడికి ఒక రాకాసి ఏనుగు సహాయ పడుతున్నదని ప్రజలు చెప్పుకునేవారు.

ఆనందపుర రాజైన నిత్యానందుడికి, ఈ విఘ్నేశ్వరపూజారి పెద్ద గడ్డుసమస్య అయి కూర్చునాడు. రాజు పంపిన సైనికులను పూజారి వాహనమైన రాకాసిఏనుగు హడల కొట్టేది. అతడి భృత్యులైన ఆటవికులు యమకింకరుల్లాగా వచ్చి మీదపడి వాళ్ళను చెల్లా చెదురు చేసేవారు.

నిత్యానందుడికి వేటపిచ్చి జాస్తి. ఆ కారణం వల్ల అతడు ఒక ఇరవైమంది సైని కులను వెంటబెట్టుకుని, వేగులవాళ్ళను కాపలా కోసం చెట్ల మీద అక్కడక్కడా వుంచి అరణ్యానికి వేటకు వచ్చాడు. అతడి వేగులవాళ్ళకు వాగు దగ్గర ఖడ్గ జీవదత్తులు కనిపించారు. వాళ్ళు పోయి తమ రాజుకు ఆ వార్త చెప్పారు.

"వాళ్ళు బహుశా ఆ విఘ్నేశ్వరపూజారి వేగులవాళ్ళయి వుంటారు. వాళ్ళను ప్రాణా లతో పట్టుకోండి. వాళ్ళ నుంచి ఆ పూజారి ద్రోహి ఏ కొండగుహలో వుంటున్నాడో తెలుసు కోవచ్చు. ఆ తరవాత ఆ గుహను చుట్టు ముట్టి వాణ్ణి నాశనం చేద్దాం. పీడ విరగడ అవుతుంది!" అన్నాడు రాజు.

ముందు సైనికులూ, కొంచెం వెనగ్గా రాజూ, ఖడ్గ జీవదత్తుల కేసి బయలుదే రారు. ఖడ్గ జీవదత్తులు యిదేమీ ఎరగరు. వాళ్లు హాయిగా మాట్లాడుకుంటూ, సూర్యాస్త మయం లోపల ఎదురుగా వున్న కొండలను చేరాలని నడుస్తున్నారు. హఠాత్తుగా వాళ్ళకు అన్ని వైపుల నుంచీ, "ఆగండి! అడుగు ముందుకు వేశారో ప్రాణాలు దక్కవు!" అన్న హెచ్చరికలు వినిపించాయి.

ఖడ్గ జీవదత్తులు ఓ క్షణం పాటు నివ్వెర పోయి చుట్టూ కలయచూశారు. గుర్రాలెక్కి వున్న నలుగురైదుగురు సైనికు లొకవైపు నుంచీ, కత్తి, కటారులు పట్టుకున్న పదీ పన్నెండుమంది సైనికులు మరొక వైపు నుంచీ వచ్చి వాళ్ళను చుట్టుముట్టారు.

—(ఇంకావుంది)





# గుణంప్రధానం

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటి లాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు బుద్ధిపూర్వకంగా శవాన్ని మోస్తున్నట్టే, 'వెనుకటికి సత్యవతి అనే రాజకుమార్తె బుద్ధిపూర్వకంగా ఒక రాక్షసుడితో కాపరం చేసింది. శ్రమ తెలియకుండా వుండగలందులకు నీకు సత్యవతి కథ చెబుతాను, విను," అంటూ ఇలా చెప్పసాగాడు :

పూర్వం దండకారణ్య ప్రాంతంలో ఒక రాక్షస సమూహం ఉండేది. వాళ్ళ మూలాన మామూలు మనుషులు ఆ ప్రాంతానికి వెళ్ళేవారే కాదు. ఆ రాక్షసులు అప్పుడప్పుడూ గ్రామాల మీద పడి, మనుషులను ఎత్తుకుపోయి భక్షించేవారు. ఈ రాక్షసులకు నాయకుడు లంబోదరుడు.

## బేతాళ కథలు



ఈ రాక్షససమూహంలో వజ్రదంతు డనే యువకుడు వుండేవాడు. వాడికి రాక్షస జీవితం మీదా, నరభక్షణ మీదా క్రమంగా అసహ్యం ఏర్పడింది. మనుషులు రాక్షసుల కన్న ఎక్కువ నీతిగానూ, న్యాయంగానూ, బతుకుతున్నారని వాడికి తోచింది. ఇలాటి ఆలోచనలు పెరుగుతూ రాగా, వజ్రదంతుడు తాను కూడా మానవుడుగా జీవించాలని నిశ్చయించుకున్నాడు.

వాడు రాక్షసమాయ చేత అందమైన యువకుడుగా మారి, వేదండపుర మనే నగరానికి వెళ్ళి, అక్కడ రాజుగా వుంటున్న ప్రసేనమహారాజు దర్శనం చేసుకుని, "మహారాజా, నా పేరు సుధీరుడు. నేను చాలా దూరదేశం నుంచి వస్తున్నాను. ఎంత కష్టమైన పని ఇచ్చినా చేయగలను. నన్ను తమ కొలువులో పెట్టుకోండి," అని అడిగాడు.

సుధీరుడి అందమూ, వినయమూ చూసి ముచ్చటపడి రాజు అతన్ని రాజభవనంలో ఒక సేవకుడుగా నియమించాడు. మానవ నాగరికతా, మర్యాదలూ నేర్చుకోవటానికి రాజభవనం కంటె మంచి చోటు ఉండదు గనక, సుధీరుడు అన్ని రకాల వాళ్ళనూ చూస్తూ అత్యుత్తమమైన ప్రవర్తన అతి త్వరగా అలవరచుకున్నాడు. దీనితోబాటు అతను తనలో సహజంగా ఉండే రాక్షస లక్షణాలను అదుపులో ఉంచుకోవటం కూడా నేర్చుకున్నాడు.

సుధీరుడు తన ధైర్యసాహసాలనూ, అసాధారణ బలపరాక్రమాలనూ ప్రదర్శించే అవకాశాలు కూడా కొన్ని కలిగాయి. దానితో రాజభవనంలో అతనంటే ప్రతి ఒక్కరికీ ఎంతో గొప్ప అభిప్రాయం ఏర్పడిపోయింది.

ఇలా ఉండగా సుషేణు డనే ఉత్తర దేశపు రాజు దిగ్విజయయాత్ర చేసుకుంటూ వేదండపురానికి వచ్చి, ప్రసేనుడి పై యుద్ధం ప్రకటించాడు. సుషేణుడి వద్ద అపారమైన సేన ఉన్నది. అతనితో యుద్ధం చేసి జయించట మనేది దుర్లభం. అందు చేత ప్రసేనుడు తన మంత్రుల సలహా

మీద, తాను సకుటుంబంగా పారిపోయి, తన రాజ్యాన్ని సుషేణుడికి వదిలెయ్యటానికి నిశ్చయించాడు.

అందుకు అభ్యంతరం చెప్పినవాడు సుధీరుడు ఒక్కడే. అతను రాజుతో, "మహా రాజా, ఈ శత్రువును నేను మంత్ర ప్రభా వంతో ఒక్క క్షణంలో పారదోలగలను. అనుమతి ఇవ్వండి," అన్నాడు.

"అలా అయితే ఆలస్యం దేనికి? వెంటనే ఆ పని చెయ్యి. మేమంతా నీ కెంతో రుణ పడి వుంటాం," అన్నాడు రాజు.

సుధీరుడు బయలుదేరి, బాగా చీకటి పడే వేళకు నగరం వెలపలకు వెళ్ళి, అక్కడ తన మాయ చేత భయంకరాకారం ధరిం చాడు. అతని శరీరం తాటిప్రమాణం ఉన్నది. అతని కళ్ళు జ్యోతులల్లే వెలుగు తున్నాయి. అతని నోట పొగలు వెళ్ళు తున్నాయి. అతని కోరలు పెద్ద ఖడ్గాలు లాగున్నాయి. ఇలాంటి అవతారంతో అతను దిక్కులు పిక్కటిల్లే లాగు సింహనాదాలు చేస్తూ, భూమి అదిరేటట్టు అంగలు వేసు కుంటూ శత్రువు లున్న సైనికశిబిరం కేసి వెళ్ళాడు.

ఈ అవతారాన్ని అంత దూరాన చూడ గానే శత్రువులకు గుండెలు అవిసిపోయాయి. వాళ్ళు తక్షణమే దొరికిన రథాల మీదా, గుర్రాల మీదా ఎక్కి చెల్లాచెదురుగా పారి పోయారు. ఏమీ దొరకనివాళ్ళు కాలిసత్తువ కొద్దీ పరిగెత్తి పోయారు. కొద్దిసేపట్లో శత్రు శిబిరం నిర్జనమై పోయింది.





సుధీరుడు అన్నంత పనీ చేసినందుకు రాజు అతన్ని ఎంతో మెచ్చుకుని, అతన్ని తన సేనానాయకుడుగా నియమించాడు.

రాజకుమార్తె సత్యవతి తన తండ్రితో తనకు సుధీరుణ్ణి పెళ్ళాడాలని ఉన్నట్టు సిగ్గు విడిచి చెప్పింది. అందుకు రాజు అభ్యంతరం చెప్పక, అతనికీ సత్యవతికీ వైభవంగా వివాహం జరిపించాడు. కాలక్రమాన వారికి పిల్లలు కూడా కలిగారు.

దండకారణ్యంలోని రాక్షసులు వేదండపురం పొలిమేరల దాకా వచ్చి మనుషులను ఎత్తుకు పోతున్నారు. అక్కడి గ్రామాలలో మనుషులు అప్పుడప్పుడూ మాయమవుతున్నట్టు రాజధానికి వార్తలు వచ్చాయి.

ఈ పనిచేస్తున్నది తన పాత అనుచరులైన రాక్షసులే నని సుధీరుడికి తెలుసును. అందుచేత, రాజ్యానికి రాక్షస బాధ లేకుండా చూసే భారం అతను తన మీదనే వేసుకున్నాడు.

అతను ఒక గ్రామానికి వెళ్ళి, ఆ రాత్రి అక్కడే మజిలీ చేశాడు. ఆ రాత్రే ఆ గ్రామానికి ఒక రాక్షసుడు వచ్చాడు. ఈ సంగతి పసిగట్టి సుధీరుడు తన అసలు స్వరూపంతో ఆ రాక్షసుడు దాగివున్న చోటుకు వెళ్ళాడు.

ఆ రాక్షసుడు అతన్ని గుర్తించి, "వజ్రదంతా, నువేనా? ఇంత కాలమూ ఏమయావు? ఎక్కడ వున్నావు?" అని అడిగాడు ఆశ్చర్యంగా.

"అవును, నేనే! ఇప్పుడు మానవుడుగా బతుకుతున్నాను. మన కున్న బలమూ, మాయలూ లేకపోయినా మన కన్న మానవులు చాలా అభివృద్ధి చెందారు. వారి నుంచి మనం నేర్చుకోవలసినది ఎంతైనా ఉన్నది. ఇప్పుడు నా జీవితం ఎంతో బాగున్నది," అన్నాడు సుధీరుడుగా మారిన వజ్రదంతుడు.

"ఛీ, ఛీ! అల్పులైన మానవులతో చేరి నువు రాక్షస జాతికి కళంకం తెచ్చావు! నిన్ను బతకనివ్వను," అంటూ రాక్షసుడు వజ్రదంతుడితో యుద్ధానికి తలపడ్డాడు.

రాక్షసుడికి మొరటుబలమే తప్ప బుద్ధిని ఉపయోగించే అలవాటు లేదు. ఆ అలవాటు వజ్రదంతుడికి అలవడి ఉండటం చేత, అతను రాక్షసుణ్ణి బలంతోనూ, యుక్తితోనూ చంపేశాడు.

ఈ విధంగా సుధీరుడు వేదండపుర రాజ్యానికి రాక్షసుల బెడద లేకుండా చెయ్యటానికి కంకణం కట్టుకుని కొందరు రాక్షసులను చంపేశాడు. మరి కొందరు అతని చేత చావుదెబ్బలు తిని ప్రాణాలతో పారిపోయి, తమ నాయకుడైన లంబోదరుడికి వజ్రదంతుడి వార్త చెప్పారు.

లంబోదరుడు వజ్రదంతుణ్ణి శిక్షించ నిశ్చయించి, సన్యాసి వేషం ధరించి వేదండ పురానికి వచ్చి, రాజు దర్శనం చేసుకుని, "రాజా, నీకు శత్రుభయం తొలగిందని విని చాలా సంతోషించాను. కాని అంత కన్న దారుణమైన రాక్షస భయం నీ రాజ్యాన్ని పీడిస్తున్నది. నీ రాజ్యంలోని ప్రజలను ఎవడో రాక్షసుడు భక్షిస్తున్నాడు. అయితే ఆ రాక్షసుడు నీ ఇంటనే ఉన్న సంగతి నీకు తెలియదు. వాడు మిమ్మల్ని మభ్యపెట్టి, మీ రాజ్యానికే ముప్పు తీసుకురానున్నాడు," అన్నాడు.

రాజు నిర్ఘాంతపోయి, "ఇది వింతగా వుంది! నా ఇంటనే ఉన్న రాక్షసుడు ఎవడు?" అని అడిగాడు.



"వాడి అసలు పేరు వజ్రదంతుడు. వాడు సుధీరుడని పేరు పెట్టుకుని, నీకు అల్లుడై, మీ ఇంట ఉండి, మీ అందరికీ తన పై ఎంతో గొప్ప అభిప్రాయం ఏర్పరచుకున్నాడు," అన్నాడు లంబోదరుడు.

సన్యాసి చెప్పే మాటలు నమ్మలేక, రాజు సుధీరుణ్ణి పిలిపించాడు. సుధీరుడు అక్కడికి రాగానే లంబోదరుడు అతన్ని వజ్రదంతుడుగా మార్చేశాడు. అతడి రాక్షస రూపం చూసి అందరూ భయపడి పోయారు.

తన రహస్యం బయట పెట్టేశాడన్న కోపంతో సుధీరుడు లంబోదరుణ్ణి పట్టి హత మార్చేశాడు. సన్యాసి కూడా రాక్షసుడేనని అందరికీ తెలిసిపోయింది.

వజ్రదంతుడు తిరిగి సుధీరుడుగా మారాడు గాని రాజపరివారం అతని రాక్షసాకారాన్ని మరిచిపోలేదు. వాళ్ళు రాజుతో, "ఈ రాక్షసుణ్ణి పంపెయ్యండి. మనమధ్య ఉండనివ్వటం అపాయకరం," అన్నారు.

రాజు కొంచెం యోచించి, "మన అందరికన్న కూడా సుధీరుణ్ణి గురించి హెచ్చు అభ్యంతరం చెప్పవలసిన మనిషి నా కుమార్తె, సత్యవతి. ఆమె నిర్ణయించిన ప్రకారం చేద్దాం," అన్నాడు.

సత్యవతిని అడిగితే ఆమె తన భర్తను పంపివెయ్యటానికి ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు. రాజు ఆమె నిర్ణయం సరిఅయినదేనని ఒప్పుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సత్యవతి తన భర్త రాక్షసుడని తెలిసి కూడా అతన్ని వదిలించుకోవటానికి ఎందుకు ఒప్పుకోలేదు? రాజు ఆమె నిర్ణయాన్ని ఎందుకు బలపరిచాడు? ఈ అనుమానాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పక పోతే నీ తల బద్దలవుతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కొందరు జన్మతః రాక్షసులు, మరి కొందరు ప్రవృత్తి చేత రాక్షసులు. సుధీరుడి ప్రవర్తనలో రాక్షసత్వం ఏమీ లేదు. అంతే గాక, సత్యవతి అతన్ని కోరి పెళ్ళాడింది. ఆమెకు అతనిలో రాక్షసత్వం ఏ రూపంలోనూ కనిపించలేదు. పై పెచ్చు, ఆమె అతనికి పిల్లలను కూడా కన్నది. అందుచేత ఆమె అతన్ని వదులుకోలేదు. ఇక రాజు మాటకు వస్తే, ఆయన సుధీరుడికి చాలా ఋణపడివున్నాడు. అతని వల్ల రాజ్యం దక్కింది. అతను ఉండగా రాజుకు శత్రుభయం లేదు. ఆ సంగతి అలా ఉంచి అతన్ని పంపేస్తే, మిత్రుడుగా ఉన్నవాడల్లా శత్రువుగా మారి అతనే తనకూ, ప్రజలకూ భయంకర ప్రమాదం కలిగించ వచ్చు. అందుచేత రాజు తన కుమార్తె చేసిన నిర్ణయాన్ని బలపరిచాడు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)






# పానకంలో పుడక

ప్రతిష్ఠానపురంలో సుదర్శనవర్మ అనే కులీనుడైన యువకుడు ఉండేవాడు. అతను విద్యావంతుడూ, ధనవంతుడూ కూడాను. అతను వివాహం చేసుకోదగిన వయసులో సుహాసిని అనే ఒక అందమైన కన్యను చూసి ప్రేమించాడు.

సుహాసిని పరువుగల వంశంలో పుట్టినదే అయినా వారి కుటుంబం అంత సంపన్న మైనది కాదు. ఆమె తండ్రి చాలాకాలం క్రితం చనిపోయాడు. సుహాసినినీ, ఆమె తల్లినీ ఆమె మేనమామ శంభుదాసు అనే వాడు పోషిస్తున్నాడు.

ఈ శంభుదాసు ధనపిశాచికి తమ్ముడు. పరమ లోభి. డబ్బు కోసం ఎలాటి హీనమైన పనులైనా చేసేవాడు. అతను ఎంతో ధనం కూడ బెట్టి కూడా తన చెల్లెలినీ, మేన గోడలినీ సాధ్యమైనంత తక్కువ ఖర్చుతో పోషించేవాడు. తన మేనగోడలు సుహాసి నికి పెళ్ళిచేసే భారం తన పైన ఉండటం చేత, ఆమెను ఎవడో ఒకడికి ముడిపెట్టి తన భారం దించేసుకుందామనుకున్నాడు. అయితే, శంభుదాసు తెచ్చిన సంబంధా లన్నిటికీ సుహాసిని తీవ్రంగా ఆక్షేపణ తెలిపింది.

అసలు సంగతి ఏమిటంటే, సుహాసినిని చూస్తూనే సుదర్శనుడు ప్రేమించినట్టే, సుహాసిని కూడా అతన్ని చూడగానే ప్రేమించింది.

ఒకే ఒకసారి సుదర్శనుడు సుహాసినితో రెండుక్షణాలు మాట్లాడ గలిగాడు. అప్పు డతను సుహాసినితో, "నీకు సమ్మతమైతే మనం పెళ్ళి చేసుకుందాం. పెళ్ళి మాటలు ఎవరితో మాట్లాడాలో చెపితే, ఆ ప్రయత్నం చేస్తాను," అన్నాడు.

"మాకు రక్షకుడు మా మేనమామ శంభుదాసుగారు. ఆయన ధాన్యం వ్యాపారం

బి. మారుతీరావు

చేస్తూ ఉంటాడు. ఆయన ఇల్లు ఫలానా చోట," అని సుహాసిని సుదర్శనుడికి చెప్పింది.

ఆ రోజే సుదర్శనుడు తన స్నేహితుణ్ణి శంభుదాసు దగ్గిరికి పంపి, సంగతి సందర్భాలు చెప్పి, తనకూ, సుహాసినికీ పెళ్ళి జరిగేటట్టు చూడమన్నాడు.

సుదర్శనుడు చాలా గొప్ప వంశానికి చెందినవాడనీ, గొప్ప ధనికుడనీ తెలియగానే శంభుదాసు గుండె ఆగిపోయింది. ఈ పెళ్ళి చేస్తే తనకు ఎంత ఖర్చయినా అవుతుంది. అదీగాక, సుదర్శనుడి వంటి అల్లుడు వచ్చినాక తన చెల్లెలు తనను దేవుడల్లే చూడటం మానేస్తుంది. ఇప్పటిలాగా తాను వారిద్దరినీ శాసించలేడు.

ఇదంతా ఆలోచించి, పరమలోభీ, కర్కోటకుడూ అయిన శంభుదాసు సుదర్శనుడికి తన మేనగోడలినిచ్చి పెళ్లిచేయ నిరాకరించాడు.

అంతటితో పోనివ్వక అతను తన చెల్లెలి ఇంటికి వెళ్ళి, "సుహాసిని ధనికులైన కుర్రవాళ్ళకు గాలం వేస్తున్నది. డబ్బున్న కుర్రవాళ్ళు ఎలాటి వాళ్ళో నాకు తెలుసు. నేను దానికి తగిన సంబంధాలు తెస్తే అది తోసిపారేసింది. దాని కళ్ళు నెత్తికెక్కాయని అప్పుడే అనుకున్నాను," అని తన చెల్లెలితో అన్నాడు.

"పిల్ల ఇల్లు కదిలి ఎక్కడికీ వెళ్ళటం లేదు, అన్నయ్యా. సాయంకాలం నేను గుడికి వెళ్ళేటప్పుడు నా వెంట వస్తుంది.



ఇద్దరమూ తిరిగి ఇంటికి వచ్చేస్తాం," అన్నది సుహాసిని తల్లి.

"మరి ఇకనేం? సాయంకాల మప్పుడే పొగరుబోతు కుర్రవాళ్ళందరూ వీధులలో వేటగాళ్ళలాగా తిరుగుతారు. రేపటి నుంచీ ఒక పని చెయ్యి. నేను కూడా రోజూ దేవుడి దర్శనం చేసుకుంటూనే ఉంటాను. కాని సాయంత్రంవేళ కాదు, తెల్లవారు ఝామున. అప్పుడు గుడికి అర్చకుడు తప్ప ఎవరూ రారు. జనం రావటం మొదలుపెట్టే వేళకు తిరిగి ఇంటికి చేరుకోవచ్చు," అన్నాడు శంభుదాసు.

శంభుదాసు ఎన్నో పాపాలు చేస్తేగాని డబ్బు సంపాదించలేనివాడు కావటం చేత, ఆ పాపాలన్నీ పోగొట్టుకునేటందుకు రోజూ తూర్పు తెల్లవారక ముందే గుడికి వెళ్ళి, దేవుడి ముందు చెంపలు వేసుకుని, మళ్ళీ పాపాలు చెయ్యటానికి హడావిడిగా ఊరి మీద పడేవాడు.

అన్న చెప్పిన దానికి ఎన్నడూ వ్యతిరేకించని చెల్లెలు, సాయంకాలం పూట గుడికి వెళ్ళటం మానేసి, సుహాసినితో సహా తెల్లవారుఝామునే దేవుడి దర్శనానికి వెళ్ళటం మొదలుపెట్టింది.

సుదర్శనుడు సుహాసినిని రోజూ చూసి సంతోషించగలందులకు ప్రతి సాయంకాలమూ, పనిగట్టుకుని గుడికి వెళుతూ వసున్నాడు.

తల్లి వెంట ఉండటం చేత సుహాసిని, తన ప్రియుడితో మాట్లాడే అవకాశం





ఏమాత్రం లేకపోయినా, అతనిలాగే చూసి సంతోషించేది.

అతను కేవలమూ తనను చూడటం కోసమే రోజూ గుడికి వస్తున్నందుకు ఆమెకు ఎంతో తృప్తికలిగేది.

అయితే శంభుదాసు అడ్డపడటం వల్ల, సుదర్శనుడికి సాయంత్రంవేళ గుడిలో సుహాసిని కనబడటం మానేసింది. రెండు రోజులు వరసగా ఆమె కనిపించక పోయే సరికి అతనికి పిచ్చి ఎత్తి నట్టయింది. ఆమె ఇంటి మీద తన మనుషులను నిఘా ఉంచి, సుహాసిని తెల్లవారుఝామునే గుడికి వెళ్ళు తున్నదన్న సంగతి తెలుసుకున్నాడు సుదర్శనుడు.

అతనికి పొద్దెక్కి లేచే అలవాటున్నది. సుహాసిని కోసం అతను చీకటితోనే లేవటం అలవాటు చేసుకుని, తానుకూడా అదే సమయానికి గుడికి హాజరయాడు.

సుహాసిని ఒక్కక్షణంపాటు మాత్రమే అతన్ని చూసింది. ఆమె కళ్ళు మెరిశాయి. కాని అతనికేసి ఆమె మళ్ళీ చూడలేదు. దానికి కారణం ఆమె వెంట ఉన్న శంభు దాసు. ఆ మనిషే ఆమె మేనమామ అయి ఉంటాడని సుదర్శనుడు సులువుగా గ్రహించాడు.

తూర్పు తెల్లవారకముందే తమతోబాటు మరొకయువకుడు కూడా గుడికి హాజరు కావటం గమనించి, శంభుదాసు సుదర్శ నుడి కేసి అనుమానంతో కొరకొరా చూశాడు.

సుదర్శనుడికి ఆగ్రహం వచ్చింది. శంభుదాసు గురించి అతను అదివరకే చాలా విషయాలు తెలుసుకుని ఉన్నాడు. ఆయన నానా గడ్డీ కరిచి డబ్బు సంపాదించటమే గాక, సుహాసినినీ, ఆమె తల్లినీ పోషిస్తున్నట్టు నటిస్తూ చాలాహీనంగా చూస్తున్నాడు. ఇంత కన్న కూడా సుదర్శనుడికి కోపం తెప్పించిన దేమంటే, శంభుదాసు సుహాసిని తనను పెళ్ళాడి సుఖంగా ఉండటానికి రాహువు లాగా అడ్డపడ్డాడు.

శంభుదాసుకు తగిన ప్రాయశ్చిత్తం ఎలా చేయటమా అని ఆలోచించి, సుదర్శనుడు

ఒక నిర్ణయానికి వచ్చాడు. అతను తిన్నగా గుడి ధర్మకర్త వద్దకు వెళ్ళి, "అయ్యా, ధర్మకర్తగారూ, మన దేవాలయం ఎందరో అనాథలను పోషిస్తున్నది. కాని అనాథా, పరమభక్తుడూ అయిన ఒక పెద్దమనిషి, దేవుడి దయకు పాత్రుడైనవాడు, పైకి కాన రాని దారిద్ర్యం అనుభవిస్తున్నాడు. ఆయన పేరు శంభుదాసు అని విన్నాను. ఆయన ఒకప్పుడు తాను తిని ఇతరులకు పెట్టగల వాడేట. అయితే, తాగుడూ, జూదమూ మొదలైన వ్యసనాలకు బానిస అయి పూర్తిగా చితికిపోయాడు. కాని తన దారిద్ర్యాన్నిగాని, తన దైవభక్తినిగాని లోకానికి తెలియనివ్వడు. ప్రతిరోజూ చీకటితో దేవాలయానికి వచ్చి, దేవుడికి మొక్కి వెళ్ళిపోతూ ఉంటాడు. మీరు ఏ రోజు తెల్లవారు ఝామున గుడికి వెళ్ళినా కనిపిస్తాడు. రేపు వచ్చే రథసప్తమికి బీదలకు అన్నదానాలూ, వస్త్రదానాలూ చేసేటప్పుడు దేవాలయంలో నుంచి తృణమో, పణమో ఆయనకు కూడా ఇప్పిస్తే బాగుంటుందని తోచింది. తరవాత మీ ఇష్టం," అన్నాడు.

ధర్మకర్త అనాథలంటే చాలా దయగల వాడు; పూజారిని అడిగి, ఒక పెద్దమనిషి రోజూ చీకటిలో ఆలయానికి వస్తాడన్నది రూఢి చేసుకున్నాడు. తరవాత ఒక రోజు ఆయన శంభుదాసును స్వయంగా చూశాడు కూడా.

రథసప్తమి వచ్చింది. ఆ రోజు గుడికి చాలామంది వచ్చారు. శంభుదాసు తన



చెల్లెలినీ, మేనగోడలినీ వెంట తెచ్చాడు. సుదర్శనుడు తన స్నేహితులను పది, పన్నెండు మందిని వెంట తెచ్చాడు. ధర్మకర్త ఆ రోజు దగ్గిరేఉండి పూజలూ, అభిషేకాలూ జరిపిస్తున్నాడు.

శంభుదాసును చూడగానే ధర్మకర్త చిల్లరడబ్బులమూట ఒకటి తెచ్చి శంభుదాసు చేతిలో ఉంచి, "ఇది దేవుడి ప్రసాదం! మీరు సమస్త వ్యసనాలకూ లోనై చితికిపోయారని తెలిసింది. తాగుడూ, జూదమూ, వ్యభిచారమూ లాటివి ఎవరినైనా జయిస్తాయి. కాని మీరు వాటిని జయించారని విని నాకు చాలా ఆనందమయింది," అన్నాడు.

శంభుదాసుకు ధర్మకర్త అనేది ఏమీ అర్థం కాలేదు. ఆయన మూట విప్పి చూస్తే, అందులో రాగి డబ్బులున్నాయి.

"అయ్యో, పాపం! ఎంత భక్తుడో!" అంటూ సుదర్శనుడూ, అతని వెంట వచ్చిన మిత్రులూ ఆ మూటలో చిల్లర డబ్బులు వేశారు.

శంభుదాసు కోపంతో అరుస్తూ, "ఏమిటిది అంతా? నే నెవరనుకున్నారు? ముష్టివాణ్ణి అనుకున్నారా?" అని తందనా లాడాడు. సుదర్శనుడు తన మిత్రులతో సహా చల్లగా బయటికి జారుకున్నాడు.

ఈ వార్త త్వరలోనే ఊరంతా తెలిసింది. శంభుదాసును చూసి అందరూ నవ్వసాగారు. ఎరిగున్నవాళ్ళు, "ఏమయ్యా, తాగటం మానేశావుట! మాతో చెప్పనన్నా లేదేం? చిల్లర డబ్బులు కావాలంటే గుడి దాకా ఎందుకు వెళ్ళటం? మేము లేమా? మమ్మల్ని అడుగు!" అంటూ హేళన ప్రారంభించారు.

తరవాత సుదర్శనుడు సుహాసిని ఇంటికి వెళ్ళి, శంభుదాసు వాళ్ళకూ, తనకూ చేసిన అన్యాయం గురించి చెప్పి, తాను సుహాసినిని పెళ్ళాడ గోరుతున్నాననీ, తానే వారికి అండగా ఉంటాననీ అన్నాడు.

ఇందుకు సుహాసిని తల్లి చాలా సంతోషించింది. సుదర్శనుడికీ సుహాసినికీ యథావిధిగా పెళ్ళి జరిగింది.





# పాముతో చెలగాటం

అనేకవేల సంవత్సరాల క్రితం ఒక దూర దేశంలో ఒక చక్రవర్తి ఉండేవాడు. ఆయన వద్ద ఒక ప్రసిద్ధుడైన మంత్రవేత్త పురోహితుడుగా ఉండేవాడు. ఆ మంత్రవేత్త భార్య మంచి అందగత్తె.

ఒకనాడు చక్రవర్తి తన సామంతులతో సహా సూర్యదేవాలయానికి వెళ్ళి, తిరిగి వస్తూ దారిలో ఉన్న తన మంత్రవేత్త ఇంటికి వెళ్ళాడు. చక్రవర్తి వెంట ఉన్న వారిలో ఆయనకు పరమ ఆప్తుడైన సామంతుడు ఒకడున్నాడు. ఆ సామంతుడి కన్ను పురోహితుడి భార్య పైన పడింది. ఆమె అందం చూసి అతనికి అపారమైన మోహం పుట్టుకువచ్చింది.

ఆ కారణంగా ఆ సామంతుడు తన సేవకుడి ద్వారా పురోహితుడి భార్యకు ఒక లేఖ పంపాడు. పురోహితుడు రాజసభలో ఉన్న సమయంలో ఆ సేవకుడు ఆ లేఖను పట్టుకుపోయి పురోహితుడి భార్యకు ఇచ్చాడు.

పురోహితుడి భార్య ఆ లేఖ చూసి ఆగ్రహించి, "నేను నీతి గలదాన్ని అనీ, పరపురుషులను సహించననీ మీ యజమానితో చెప్పు," అన్నది.

సేవకుడు సామంతుడికి పురోహితుడి భార్య అన్న మాటలు చెప్పాడు. అతను ఒక రోజు ఆగి చూశాడు. పురోహితుడితో అతని భార్య తన ప్రేమ లేఖ గురించి చెప్పినట్టులేదు. అందుచేత అతనికి ఆశ రెట్టింపు అయింది. అతను పురోహితుడి భార్య వద్దకు మరొకసారి తన సేవకుణ్ణి పంపాడు.

ఆ సేవకుడు పురోహితుడి భార్యతో, "మా ఏలిక మీ కోసం చాలా పెద్ద విరహం అనుభవిస్తున్నారు. ఆయన చాలా సమర్థుడు. తలుచుకుంటే ఏమైనా చెయ్య

జి. కుమారస్వామి

గలడు. ఆయనను నిరాకరించటం పాముతో చెలగాటం! అందుచేత మీరు ఆయన కోరిక తీర్చినట్టయితే మీకు అంతులేని లాభాలు కలుగుతాయి," అని చెప్పాడు.

పురోహితుడి భార్య చాలాసేపు ఆలోచించి, "రేపు రా, నువు అడిగినదానికి సరి అయిన జవాబు ఇస్తాను," అన్నది.

ఆ సాయంకాలం పురోహితుడు ఇంటికి రాగానే, ఆమె అతడితో, సామంతుడు తనను శనిలాగా పట్టుకున్నాడని చెప్పేసింది.

పురోహితుడు సామంతుడి ప్రణయ సందేశాలను గురించి విని, "అతన్ని నిర్మూలించటం ఒక పెద్ద సమస్య కాదు. కాని అతను చక్రవర్తికి పరమ ఆప్తుడు. అతని చావుకు కారణం ఎవరని చక్రవర్తి అడిగితే మంత్రవేత్తనైన నేను నిజం చెప్పితీరాలి. అందుచేత ఈ సామంతుణ్ణి తుదముట్టించే నిర్ణయం చక్రవర్తి ద్వారానే జరిగించాలి. నేను చెప్పినట్టు చెయ్యి," అంటూ భార్యకు కొన్ని విషయాలు చెప్పాడు.

మర్నాడు సామంతుడి సేవకుడు రాగానే పురోహితుడి భార్య, "నిజం దాచటం దేనికి? నేను కూడా మీ ప్రభువును ప్రేమిస్తున్నాను. ఈ సాయంకాలం చీకటి పడ్డాక మీ యజమానిని, కోనేటి మధ్య ఉండే మా మందిరానికి రమ్మను. అక్కడ నేనూ, నా దాసీ వుంటాము," అన్నది.

సామంతు డీ మాట విని పరమానంద భరితుడై, ఆ సాయంకాలం చీకటి పడగానే కోనేరు వద్దకు వెళ్ళాడు. అక్కడ ఒక



చిన్న పడవ ఉన్నది. పడవవాడు అతన్ని కోనేటి గృహానికి తీసుకుపోయాడు. ఆ పడవలో జానెడు నిడివి గల లక్క మొసలి బొమ్మ ఉండటం సామంతుడు చూశాడు.

కోనేటి గృహంలో పురోహితుడి భార్య చక్కగా అలంకరించుకుని సామంతుడి కోసం ఎదురుచూస్తున్నది. ఆమె అతన్ని చూడగానే, "కోనేట్లో స్నానంచేసి రండి. ఫలహారం సిద్ధంగా ఉన్నది," అన్నది.

సామంతుడు స్నానం చెయ్యటం కోసం కోనేటిలోకి దూకగానే పడవవాడు, పురోహితుడు ముందే చెప్పి ఉండటంచేత, లక్క మొసలిని నీటిలోకి జార్చాడు. వెంటనే అది అయిదుబారల నిజం మొసలిగా మారి, సామంతుణ్ణి నోట కరుచుకుని కోనేటి అడుగుకు వెళ్ళిపోయింది.

మరి కాస్సేపటికి పురోహితుడు చక్రవర్తిని వెంటబెట్టుకుని కోనేటి వద్దకు వచ్చాడు. "ఏమిటి నువు చూపుతానన్న అద్భుతం?" అని చక్రవర్తి పురోహితుణ్ణి అడిగాడు.

"చిత్తగించండి!" అంటూ పురోహితుడు మొసలిని పిలిచాడు.

వెంటనే బ్రహ్మాండమైన మొసలి నీటి పైకి వచ్చింది. దాని నోట్లో సామంతుడున్నాడు.

"ఎంత ఘోరం! ఎంత దారుణం!" అన్నాడు చక్రవర్తి, సామంతుణ్ణి గుర్తించి.

"అసలు ఘోరం ఇది కాదు, మహారాజా! ఇది బొమ్మమొసలి," అంటూ పురోహితుడు మొసలిని నీటినుంచి పైకి తీశాడు. అది జానెడు పొడుగున్న లక్క మొసలి.

తరవాత పురోహితుడు సామంతుడు తన భార్యను వేధించటం గురించి చక్రవర్తికి పూర్తిగా చెప్పాడు. సామంతుడి ప్రవర్తనకు చక్రవర్తి సహించలేక, తన చేతిలో ఉన్న బొమ్మమొసలితో, "నీ సొత్తు నువు తీసుకో!" అంటూ నీటిలోకి విసిరేశాడు.

వెంటనే ఆ బొమ్మమొసలి మామూలు మొసలిగా మారి, సామంతుణ్ణి నోట కరుచుకుని, శాశ్వతంగా కోనేటి అడుగుకు వెళ్ళిపోయింది.



# బుద్ధిలేనివాడు

ఒక గ్రామంలో ఒక గొప్ప జ్యోతిష్కుడు ఉండేవాడు. ఆయనకు లేక లేక ఒక కొడుకు కలిగాడు. కాని వాడు మూఢుడు. జ్యోతిష్కుడు వాడికి అతి కష్టం మీద ప్రశ్నశాస్త్రం నేర్పాడు. వాడు ఆ శాస్త్రాన్ని చిలక లాగా నేర్చుకున్నాడు.

ఒకనాడు జ్యోతిష్కుడు వాణ్ణి రాజుగారి దగ్గిరికి తీసుకుపోయి, "మహారాజా, వీడు నా కొడుకు. ప్రశ్నశాస్త్రం పూర్తిగా నేర్చుకున్నాడు. కావలిస్తే పరీక్షించి చూడండి," అన్నాడు.

రాజు తన పిడికిట ఒక ఉంగరం పెట్టుకుని, "నా చేతిలో ఏమున్నది?" అని అడిగాడు.

మూఢుడు కొంతసేపు గుణించి, "మహారాజా, మీ చేతిలో ఉన్నది మూల పదార్థం కాదు, జీవపదార్థం కాదు, ధాతు సంబంధమైనది," అన్నాడు.

"భేష్! ఇంకా చెప్పు," అన్నాడు రాజు.

"అది గుండ్రని వస్తువు. మధ్యలో శూన్యంగా ఉంటుంది," అన్నాడు మూఢుడు.

"నిజమే. ఇంకా చెప్పు!" అన్నాడు రాజు మెచ్చుకుంటూ.

మూఢుడు పొంగిపోయి, "మహారాజా, మీ చేతిలో ఉన్నది తిరగలిరాయి!" అన్నాడు.

—ఎ. మధుబాల







ఈ చిత్రానికి కథానాయకుడు ఒక వ్యక్తి కాదు, మధ్య తరగతికి చెందిన ఒక కుటుంబం. మధ్య తరగతి కుటుంబాలు రాబడికి మించిన ఖర్చులు చేసే మనస్తత్వాన్ని పెంచుకుని, అంత కంతకూ పెరిగిపోయే తమ కోరికలకు బానిసలై, పొదుపుగా జీవించడం చేతగాక, అధికంగా డబ్బు సంపాదించటానికి అక్రమమైన మార్గాలు అవలంబించి, తాము చెడటమే కాకుండా సమాజానికి కూడా ద్రోహం చేసి, చివరకు దేశంయొక్క పురోభివృద్ధికే పేరుపురుగు లవుతారు.

బాధ్యత తెలియవలసిన పెద్దవారే ఇలా ఉంటే, చదువుకున్న మధ్య తరగతి యువకులు కుటుంబ నిర్వహణ భారం ఏమిటో తెలియక, తమ కోరికలన్నీ తీరేవే అనుకుని, అవి తీరనప్పుడు బాధ పడతారు. ఆటువంటి యువతీ యువకులకు, బాధ్యత మీద పడినప్పుడు, తాము ఎంత తప్పు దోవలో ఉన్నదీ తెలిసి వస్తుంది. ఇది గ్రహించే శంకర్‌నాథ్ ఇల్లు నడిపే బాధ్యత తన కుమారుడికి అప్పగించాడు.

ఇదే ఈ చిత్రం ద్వారా మేము దేశానికి ఇవ్వదలచిన సందేశం. ఈ చిత్రం సమాజానికి చేయగల మేలును గుర్తించి ప్రభుత్వం దీనిపై సెంట్రల్ ఎక్సయిజు ఎత్తి వేసింది. అలాగే అనేక రాష్ట్ర ప్రభుత్వాలు ఈ చిత్రం పైన వినోదపు పన్ను కూడా రద్దు చేశాయి.

"ఘర్ ఘర్ కీ కహానీ" ద్వారా ఈ సందేశాన్ని ప్రతి కుటుంబానికీ అందించగలిగితే, మేము చిత్రరంగానికి గొప్ప సేవ చేశామని గర్విస్తాము.

మద్రాసు
15.9.1971



నాగిరెడ్డి
చక్రపాణి



# ఘర్ ఘర్ కీ కహానీ

(ఇంటింటి గాథ)

శంకరనాథ్ ఒక మధ్యతరగతి కుటుంబీకుడు. అతడు ఆదర్శప్రాయుడైన తండ్రీ, భర్తా కూడాను. మంచం ఉన్నంత వరకే కాళ్ళు చాచుకోవాలనేది ఆయన సిద్ధాంతం. జీవనవ్యయ ప్రమాణము బాగా పెరిగిపోయిన ఈ దినాలలో మధ్యతరగతి కుటుంబీకులు కోరికలు పెంచుకొని, వ్యసనాలకు లోనై ఎలా నాశనమయ్యేదీ శంకరనాథ్ కళ్ళారా చూచి వున్నాడు.

శంకరనాథ్ భార్య పద్మ ఆదర్శగృహిణి. ఈ దంపతులకు యిద్దరు అబ్బాయిలూ, ఒక అమ్మాయీ. వాళ్ళ పేర్లు రవీ, రాజా, రూపా. అంతా స్కూళ్లలో చదువుకుంటున్నారు. ఆ కుటుంబం ఉన్నంతలో సుఖంగా దినాలు గడుపుతోంది.

సాధూరాం కుటుంబం పై కుటుంబానికి పూర్తిగా విరుద్ధమైనది. శంకరనాథ్ ఒక ఆఫీసు మేనేజరు. అదే ఆఫీసులో సాధూరాం హెడ్ క్లర్క్. అతనికి మొత్తం అయిదు మంది పిల్లలు. సాధూరాం జీవితపథం శంకరనాథ్‌కు భిన్నమైనది. శంకరనాథ్‌కు 600 జీతం. సాధూరాంకు 300. అయినా కూడా సాధూరాం ఒక గొప్ప బంగళాలో ఉంటున్నాడు. అతని భార్య జమున ఒంటి నిండా నగలు. వారి పిల్లల ప్రతి కోరికా తీర్చగలుగుతున్నారు.

సాధూరాం మంచీ-చెడ్డా అనే విచక్షణ లేకుండా అన్ని మార్గాలా సంపాదించడంలో వెనుకాడడు. ఈ రెండు కుటుంబాల ఆదాయ, వ్యయాలు బేరీజు వేసే

మార్గాలే భిన్నంగా వున్నాయి. పద్మ అన్న సీతారాం మూడో కుటుంబ యజమాని. అతనికి ఆదాయ, వ్యయాలు బేరీజు వేయాల్సిన సమస్యే లేదు. అతని సమస్య అంతా చెడుదారిలో పడ్డ గోపీని మంచి మార్గంలో పెట్టి, మునిగే కుటుంబాన్ని ఎలా రక్షించడమనేదే. సీతారాం భార్య జానకి ఒక సంపన్న కుటుంబానికి చెందినది. అందుచేత ఆ ధనగర్వంతో ఆమె భర్తను లక్ష్యం చేసేదికాదు. కళ్ళు మూసుకుని రెండు చేతులా తన కొడుకు ముద్దు-ముచ్చటలు తీర్చేందుకు డబ్బు వెదజల్లేది. ఈ కారణంగా గోపీ చెడు సాంగత్యంలో పడ్డాడు.

శంకరనాథ్ లాంటి ఆదర్శకుటుంబంలో కూడా ఒకనాడు అకస్మాత్తుగా ఒక సమస్య బయలుదేరింది. రవి లాంటి వివేకవంతుని మనస్సులో గోపీ విషబీజాలు నాటాడు. గోపీ మరెవడో కాదు, రవి మేనమామ కుమారుడే.

హైస్కూలు విద్యార్థులంతా అజంతా, ఎల్లోరాల పర్యటనకు బయలుదేరాలని నిశ్చయించుకున్నారు. రవి విద్యార్థి సమితి సెక్రటరీ. ప్రతి విద్యార్థి పర్యటన ఖర్చులకుగాను 50 రూపాయలు చెల్లించాలని నిర్ణయించారు. రవి ఆ మొత్తం యివ్వవలసిందిగా తన నాన్నను అడిగాడు.

శంకరనాథ్ యింత మొత్తము యివ్వజాలనని ఖచ్చితంగా చెప్పేశాడు. పర్యటనకు వెళ్ళేందుకు తహతహలాడే రవి తన మనస్సును సమాధానపరుచుకోలేకపోయాడు. అతడి మనస్సులో గోపీ చెప్పిన మాటలు యింకా ప్రతిధ్వనిస్తూనే



వున్నాయి: "రవీ, మీ నాన్నగారి ఆఫీసులో పనిచేసే సాధూరాం వాళ్ళ అబ్బాయి మురళికి 50 రూపాయలే గాదు, పైగా జేబు ఖర్చుకు అదనంగా యిరవై రూపాయలిచ్చాడు. సాధూరాంకు జీతమెంతో తెలుసా? మీ నాన్నగారి జీతంలో సగం కూడా లేదు. మీ నాన్న పిసినిగొట్టు. డబ్బు యివ్వడం ఆయనకు యిష్టం లేదు సుమా!"

గోపీ అన్న ఈ మాటలు రవి హృదయంలో అలజడి రేకెత్తించాయి. అయినా కూడా రవి ఆదర్శదంపతుల సంతానం. అందుచేతనే అతడు తన తండ్రిని వ్యతిరేకించినా, గాంధీగారు ప్రయోగించిన సత్యాగ్రహాన్ని అనుసరించాడు; అంటే రవి ఉపవాసం ప్రారంభించాడు. చెల్లెలు రూపా, తమ్ముడు రాజా కూడా రవి చూపిన మార్గాన్నే అనుసరించారు. రూపాకు నాటకంలో అభినయించేందుకు కొత్త 'ఫ్రాక్' శంకరనాథ్ కొని పెట్టలేకపోయాడు. రాజాకు బైసికిలు కావాలంటే లభించింది కాదు.

ఈ విధంగా శంకరనాథ్ కుటుంబంలో తుఫాను బయలుదేరింది.

పద్మ హృదయం ఎంతగానో క్షోభించింది. ఒకవైపు భర్త యెడల భక్తి శ్రద్ధలు, మరో వైపు పిల్లలపై వాత్సల్యం! చివరకు ఆమె మాతృత్వమే మొగ్గు చూపింది. పిల్లల కోర్కెలు తీర్చవలసిందిగా సిఫారిసు చేస్తూ, "మీ హృదయం యింత కఠోరమైనదని నేను ఊహించలేక పోయాను. పిల్లలు ఉపవాసం చేస్తున్నారు. వాళ్ళ కోరికలు తీర్చ



లేక పోయారా? ఇంతలో ఏమి మునిగి పోయింది?" అన్నది బాధగా.

శంకరనాథ్ సహజంగా తన సరళ మృదుమధురమైన కంఠంతో అన్నాడు: "పద్మా! మన 20 సంవత్సరాల దాంపత్య జీవితంలో నీవు నా హృధయాన్ని ఎన్నడైనా కఠోరంగా చూచావా? ఈ నాడు మనము పిల్లల ఈ కోర్కెలు తీర్చినట్లయితే వారి కోర్కెలు పెరుగుతూనే పోతూవుంటాయి. చివరకు వారి కోర్కెలను తీర్చటానికి మన జీతం చాలదు సరిగదా, పైగా మనం అప్పులపాలు కావలసి వస్తుంది."

శంకరనాథ్ పైకి ఈ మాటలైతే అన్నాడు కానీ, అతడు తన మనస్సును సమాధాన పరుచుకోలేక పోయాడు.

ఆ రాత్రి పిల్లలు అన్నం తినలేదు. వాళ్ళ తల్లి ఎలా తింటుంది! శంకరనాథ్ తాను కూడా తినలేక పోయాడు. ఆ రాత్రి అంతా అతడు ఆలోచిస్తూ ఉండిపోయాడు.

ఈనాడు మధ్య తరగతి కుటుంబీకులైన ప్రతి తల్లీ తండ్రీ ఆదాయ వ్యయాలను సరి చూసుకునే సమస్యను ఎదుర్కొంటున్నారు. ఒకవైపు పిల్లల యెడల ప్రేమా, మరోవైపు భార్య అభ్యర్థనా, జీవితపు విలువలూ, సాంఘిక కట్టుబాట్లూ—వీటిమధ్య కుటుంబ మనే నావను దరిచేర్చవలసిన బాధ్యత చుక్కానీ పట్టేవాళ్ళ పైనే ఉంది. శంకర నాథ్ తన కర్తవ్యాన్ని బాగా ఎరిగినవాడు; అయినా తన కుమారుని మనసులో అల జడి ఎలా చెలరేగిందో తెలుసుకోలేక సత





మత మయ్యాడు. ఇందులో బయటివాళ్ళ ప్రమేయ ముందని అతడు ఊహించాడు.

రవి యిప్పుడు 16వ యేట ప్రవేశించాడు. అతన్ని దండించీ, తిట్టీ సరైన మార్గంలో పెట్టడం తప్పు. స్నేహభావం తోటే అతనికి కర్తవ్య బోధచేసి సరైన మార్గంలో పెట్టడం ఎంతైనా అవసరం. పెద్దలు చెప్పనే చెప్పారు గదా—

"లాలయేత్ పంచవర్షాణి
దశవర్షాణి తాడయేత్
ప్రాప్తేషు షోడశేవర్షే
పుత్రంమిత్ర వదాచరేత్."

తెల్లవారగానే శంకరనాథ్ ప్రేమతో రవిని పిలిచి యిలా చెప్పాడు: "రవీ, నీవు బుద్ధిమంతుడివి. నవ యువకుడివి. నీకు యింటి పరిస్థితి గురించి తెలియని దంటూ ఏమీ లేదు, నాయనా! ఈ రోజునుండీ యింటి బాధ్యత నీకు అప్పగించాలను కుంటున్నాను. ప్రతి మాసమూ జీతమంతా నీ చేతికిస్తాను. నా బస్సుటికెట్, సిగరెట్ ఖర్చులు మాత్రం నిన్నడిగి తీసుకుంటాను. మీ అమ్మతో సంప్రదించి యింటి ఖర్చు బడ్జెట్ తయారుచేసుకో. నెలాఖరులో మిగిలిన డబ్బుతో నీకూ తమ్ముడికీ చెల్లాయికీ కావలసిన వస్తువులన్నీ కొనుక్కో."

తండ్రి సలహాను రవి సంతోషంతో స్వీకరించాడు. వారి మధ్య ఈ విధంగా సంధి జరిగింది. ఉపవాసము విరమించారు.

ముగ్గురు పిల్లలూ కలసి బడ్జెట్ తయారు చేశారు. తల్లినడిగి రవి యింటికి కావలసిన వస్తువుల జాబితా తీసుకున్నాడు.

"నాయనా! నీవు చదువుకోవలసిన వాడివి, ఈ బరువు బాధ్యతలు మీ నాన్నగారికే వదిలెయ్యి!" అని పద్మ రవిని కోరింది. కాని రవి సమ్మతించలేదు.

ఒక నెల గడిచిపోయింది. పిల్లల చేతిలో ఒక పైసా కూడా మిగిలింది కాదు. రూపాకు ఏదో ఆలోచన తట్టింది. "అన్నయ్యా! పనిమనిషిని తీసేసి ఆ పని మనమే చేసుకున్నట్లయితే నెలకు ముప్పయి రూపాయలు మిగులుతవి." అన్నది.

ఈ సలహా అందరికీ నచ్చింది. వాళ్ళే స్వయంగా అన్ని పనులూ చేయనారంభించారు. ఈలోగా రాజు మోసపోయి పది రూపాయలు పోగొట్టుకున్నాడు. ఆ లోటును తీర్చేందుకు బస్సు చార్జీలు మిగిల్చి, ముగ్గురూ కాలినడకన స్కూలుకు వెళ్ళాలని రాజు సూచించాడు. రవీ, రూపాలకు కూడా ఆ సలహా నచ్చింది. అంతా కాలినడకన స్కూలుకు వెళ్ళడం ప్రారంభించారు. పిల్లల కర్తవ్యపరాయణత్వమూ, త్యాగమూ చూచి తండ్రి కూడా కాలినడకన ఆఫీసుకు వెళ్ళసాగాడు. పిల్లలు ఈ విధంగా స్వానుభవంతో పరిశ్రమా, త్యాగం, స్వావలంబనమూ అనే పాఠాలు నేర్చుకున్నారు.

గోపీ తండ్రి సీతారాం, పిల్లల ఈ ఆదర్శానికి ఎంతో ముగ్ధుడయ్యాడు. తన కొడుకు కొరగానితనానికి మానసికంగా ఎంతో బాధపడ్డాడు కూడా. అతడు కూడా



తన కొడుకు భవిష్యత్తును తీర్చిదిద్దాలని కలలు కన్నాడు.

అయితే, ఆ అవకాశం అతనికి లభించింది కాదు. తన కొడుకు చెడు సాంగత్యంలో పడి, అల్లరిపాలు కావడం కళ్ళారా చూచి కూడా బాధపడుతూ అతను ఏమీ చేయలేక పోయాడు.

శంకరనాథ్ పిల్లల బడ్జెట్‌లో క్రమేణా లోటు పూర్తి అవుతూ వచ్చింది. వాళ్ళ ఆత్మవిశ్వాసం పెరిగింది. ఈలోగా దీపావళి పండుగ వచ్చింది. పద్మ తన పిల్లలకు కొత్తబట్టలు కొనాలనుకుంది. కాని పిల్లలు, బడ్జెట్ లోటుపడుతుందని వ్యతిరేకించారు. రాజా పటాసులు కావాలని ఉవ్విళ్ళూరాడు. కాని రవీ, రూపా అతనికి నచ్చ జెప్పారు: "రాజా, పటాసులు కాల్చడం రూపాయలను బూడిదలో పోయడమే సుమా!" ఈ మాటలు వినగానే శంకరనాథ్ కూడా





ఆలోచనలో పడ్డాడు—సిగరెట్లు కాల్చడం అంటే రూపాయలు బుగ్గిపాలు చేయడమే కదా! అతడు ఆ నాడే సిగరెట్లు కాల్చడం మానేశాడు. రాజా పటాసుల కోసం తహ తహలాడుతున్నాడని తెలుసుకొని అతనికి

ఖర్చయింది. మిఠాయిలూ, టాక్సీ ఖర్చులూ, డాక్టరు బిల్లులూ చెల్లించేందుకు మిగులులో వున్న డబ్బంతా హారతికర్పూరంలా హరించుకుపోయింది. వికలమనస్కుడై రవి అనేవాడు: "దీపావళి రానే వచ్చిందిగానీ మేము దివాళా తీశాం."

ఈ పరిస్థితిలో కూడా పిల్లలు చలించలేదు. వారి ధైర్యసాహసాలకు పరీక్ష రానే వచ్చింది. పద్మ జబ్బుపడ్డది. ఆమె చాటుగా పిల్లల పనులన్నీ తానే చేస్తూ వచ్చింది. విసుగూ విరామం లేకుండా పనులన్నీ చూస్తూ కూడా ఆమె నిట్టూర్చింది కాదు. డాక్టరు ఆమెను పరీక్ష చేసి, రవిని దగ్గరకు పిలచి చెప్పాడు: "రవీ, మీ అమ్మకు చాలా రోజులుగా జ్వరం వస్తోంది. యిది మామూలు జ్వరంకాదు—టైఫాయిడ్. అయినా కూడా గాబరా పడాల్సిన అవసరంలేదు."



పటాసులు కొనవలసినదిగా సిఫారిసు చేశాడు.

ఆ రోజుల్లోనే శంకరనాథుని అన్న కుమారుడు తలవని తలంపుగా కుటుంబంతో సహా వచ్చిపడ్డాడు. కుటుంబంలో విపరీతంగా



డాక్టరు వెళ్ళిపోగానే పద్మ రవితో అన్నది: "నాయనా నా కోసం ఎందు కింత ఖర్చు చేస్తావు? మన ఆదాయం విషయం నీకు తెలుసు గదా!" రవి వ్యాకుల హృదయుడై అన్నాడు: "అమ్మా! నీ ప్రాణాల కంటే డబ్బు విలువ ఎక్కువ కాదు గదా!"

పద్మ తిరిగి ఆరోగ్యవంతురాలైంది. యింటిల్లపాది సంతోషించారు. కానీ బడ్జెట్ లోటు మరీ పెరిగిపోయింది. ఆ లోటును భర్తీ చేయాలనే సంకల్పంతో రవి పార్ట్ టైమ్ ఉద్యోగం వెతక నారంభించాడు. అతడు ఎన్నో ఆఫీసుల చుట్టూ తిరిగాడు. కానీ ఎక్కడా ఉద్యోగం దొరికింది కాదు. చివరకు అతను లక్ష్మీదాసు అనే ఒక కాంట్రాక్టరు దగ్గర కెళ్ళాడు. మొదట అతడు రవికి ఉద్యోగం యిచ్చేందుకు తిరస్కరించాడు. కానీ, రవి శంకరనాథ్ కుమారుడని తెలియగానే మరుసటి రోజు తనను కలుసుకోవలసిందిగా చెప్పి పంపాడు.

లక్ష్మీదాసు అంతటితో ఆగలేదు. శంకరనాథ్ ఆఫీసుకు వెళ్ళి యిలా అన్నాడు: "పాపం, మీ రేదో కష్టాల్లో ఉన్నట్లుంది. ఈ డబ్బు మీ వద్ద ఉంచండి." అంటూ నోట్లకట్టలు అతని చేతికి ఇవ్వజూపాడు.

అసలు విషయం అర్థం కాగానే శంకరనాథ్ నోట్లకట్టలను లక్ష్మీదాసు ముఖంపై విసురుతూ, రౌద్రస్వరంతో అన్నాడు: "లక్ష్మీదాస్! లంచం యిచ్చి నువు నన్ను కొనలేవు సుమా! మళ్ళీ యిలాంటి పారపాటు చేశావా, నిన్ను పోలీసులకు అప్పగిస్తాను. జాగ్రత్త!"



ఆ ఆవేశంలో ఇంటికి వెళుతూనే శంకర నాథ్, రవిని బాదడం మొదలెట్టాడు. "రవీ, నా మానమర్యాదలను మంట కలిపేశావు. నేను జీవితమంతా సంపాదించిన మంచి పేరుకు మసి పూశావు!"

రవి ఆశ్చర్యానికి అంతులేదు. అతనికి తన తప్పేమిటో అర్థంకాలేదు. తండ్రి ద్వారా విషయం తెలియగానే అసలు విషయం చెప్పకుండా ఉండలేక పోయాడు. "నా ఆటపాటల సమయాన్ని వృథా చేయ కుండా కొద్దో, గొప్పో సంపాదించాలను కున్నాను. అమ్మ జబ్బు వల్ల ఏర్పడిన లోటు బడ్జెట్‌ను పూరించాలనుకున్నాను. యిదేగా నేను చేసిన తప్పు? నాకు ఉద్యోగం యివ్వజూపడంలో లక్ష్మిదాసుకు ఏదో స్వార్థం ఉందని నేనెలా తెలుసుకో గల్గుతాను?"

రవి ఆదర్శానికి పద్మ హృదయం కరగి పోయింది. ఏడుస్తూ ఆమె యిలా అంది: "బాబూ! ఈ చిన్న వయస్సులోనే నీవు కుటుంబ బాధ్యతను అర్థంచేసుకో గల్గావు." ఈ మాటలంటూ ఆమె రవిని తన హృదయా నికి హత్తుకుంది.

శంకరనాథ్‌కు కనువిప్పు అయింది. ద్రవించిన హృదయంతో అన్నాడు: "బాబూ! నే తప్పు చేశాను. నిన్ను అర్థం చేసుకోలేక పోయాను, క్షమించు!"

* * *

సాధూరాం ఆదాయం అతని కుటుంబ అవసరాలకు సరిపోయేది కాదు. అందు చేత అతడిలో లంచగొండితనం కూడా పెరు గుతూ వచ్చింది. టెండర్ల ఫైళ్ళు లంచాలతో కదిలేవి. ఒకనాడు పోలీసువాళ్ళు పన్నిన



వలలో లంచం తీసుకుంటూ చిక్కాడు. అతడి పాప ఫలితం కుటుంబమంతా అనుభవించవలసి వచ్చింది. అతడి కుమార్తె నిశ్చితార్థం కూడా ఆగిపోయింది.

సాధూరాం జైలుకు వెళ్ళగానే జమున హృదయం ఎంతో క్షోభించింది. తన కుమార్తె పెండ్లి ఆగిపోయినందుకు విలపిస్తూ ఆమె యిలా అంది:

"మీ నాన్నగారు లంచం తీసుకుంటారని నాకేం తెలుసమ్మా?"

"అలా అనకు! ఈ విషయం మన అందరికీ తెలియకుండా పోలేదు. మన కొచ్చే ఆదాయంతో నాన్నగారు మన కోర్కెలన్నీ తీర్చేవారా? నాన్నగారికి జీతమెంతో నీకు తెలుసా? మన అవసరాలు తీరుతున్నాయి గదా అని మనమంతా సంతోషంలో మునిగిపోయి వుండేవాళ్ళం. కాని ఈ డబ్బంతా నాన్నగారి కెలా వస్తుందో అని నీ వెన్నడైనా ఆలోచించావా? ఈ రోజు నాన్నగారు జైలు కెళ్ళారంటే నా కోసం, నీ కోసం, మన అందరి కోసం, అమ్మా! మన అందరి కోసం!"

"నాకీ విషయం ముందుగానే తెలిసి వుంటే, లంచం తీసుకుంటే ఇలాంటి భయంకర పరిణామాలను ఎదుర్కోవలసి వస్తుందని, నేను మీ నాన్నతో చెప్పేదాన్ని. మాకు గంజో కలో చాలు. దాంతోనే తృప్తి పడతాం. కాని మర్యాదను మంటకలపే ఈ నగలూ, వైభవాలూ మాకు అక్కర లేదు" అని జమున రోదించింది. సాధూరాం కుటుంబంలోని ఉల్లాసం విషాదంగా మారిపోయింది.



తన బడ్జెట్ లోటును పూరించేందుకు రవికి ఒక మంచి అవకాశం లభించింది. స్కూలు వార్షికోత్సవంలో శ్రవణకుమార్ పాత్రను అభినయించినందుకు అతనికి బహుమానంగా స్వర్ణపతకము లభించింది. ఆ పతకానికి బదులుగా నగదు రూపాయలు యిప్పించమని అతడు హెడ్‌మాష్టరును కోరాడు. స్కూలు కమిటీ చేర్మన్ రవి సదుద్దేశాన్ని అర్థం చేసుకొని పతకం విలువ నూరు రూపాయలతోపాటు తన తరఫున నూరు రూపాయలు యిచ్చాడు: రవి ఆ డబ్బు స్వీకరించలేదు—"అయ్యా! నాకు పతకం విలువ మాత్రం యిప్పించండి. దయతో యిచ్చే ఆ డబ్బు నా కక్కర లేదు," అని రవి అన్నాడు.

"రవీ, నీలాంటి విద్యార్థులు మా స్కూలులో ఉన్నందుకు మే మెంతో గర్విస్తున్నాము. నీ ఆదర్శం యితర విద్యార్థులకు కూడా అనుకరణీయమైనది. మే మీ డబ్బిచ్చేందుకు గర్విస్తున్నాం. యిది స్కూలుకే గర్వకారణం," అన్నాడు చేర్మన్.

రవి ఆ డబ్బు తెచ్చి తల్లి పాదాలపై వుంచాడు. తల్లి ఆ డబ్బును దేవుని చరణాల పై ఉంచమన్నది. శ్రవణకుమారుని పాత్ర అభినయించిన రవి అన్నాడు: "అమ్మా! నీవే నా దేవతవు!" తల్లి హృదయం పుత్రవాత్సల్యంతో ఉప్పొంగి పోయింది.

అదే సమయంలో శంకరనాథ్ తన జీతం 600 రూపాయలు తెచ్చాడు. రవి యిచ్చిన 200 ఒక చేతిలోనూ, తన



జీతం డబ్బులు మరొక చేతిలోనూ వుంచి, శంకరనాథ్ ఇలా అన్నాడు: "రవీ, ఈ రెండు వందల రూపాయలు 600 రూపాయల కంటే బరువుగా వున్నాయి సుమా!"

తండ్రి నోటినుండి వెలువడిన ఈమాటలు స్కూల్లో లభించిన బహుమానాని కంటే ఎక్కువ విలువైనవిగా రవికి తోచాయి. కుటుంబంలో ఆనందం వెల్లివిరిసింది.

గోపీ దుష్టసాంగత్యంలో పడి తల్లి యిచ్చిన డబ్బులతో పాటు ట్రాన్సిస్టర్, సైకిలూ కూడా జూదంలో పోగొట్టుకున్నాడు. గోపీ యింటికి రాగానే, సీతారాం ఓర్పు నశించింది. తన కొడుకు పతనానికి భార్యయే కారణమని భార్య చేతుల్లో నుంచి బీరువా తాళపుచెవులు లాక్కొని, "ఈ యిల్లు నాది. వీడు నా కొడుకు. ఈ రెంటినీ రక్షిం చాల్సిన బాధ్యత నాది. మీలో ఎవరికైనా నామాటలు రుచించని పక్షంలో ఈ యింట్లో నుంచి వెళ్ళిపోవచ్చు," అన్నాడు.

గోపీని కూడా, "సాయంకాలం లోగా ట్రాన్సిస్టర్, సైకిలు తీసుకురాక పోయావా, నీవు యింటికి రావల్సిన అవసరం లేదు," అని మందలించాడు. అప్పుడు ఒక పళ్ళ బుట్ట గోపీ చేతికిచ్చి, మేనత్త యింట్లో యిచ్చి రావల్సిందిగా ఆదేశించాడు.

గోపీ శంకరనాథ్ యిల్లు ప్రవేశించగానే, రవి మేజాసొరుగులో డబ్బులుంచి వెళ్ళి పోవడం చూచాడు. గోపీ మనసులో ట్రాన్సిస్టర్, సైకిలూ విడిపించుకోవాలనే కోర్కె కలిగింది. ఎనిమిదివందల రూపాయలు అనాయసంగా అతడికి లభించాయి. ఆ డబ్బుతో వాడు పారిపోయాడు.



సీతారాం తన చెల్లెలు పద్మను పరామర్శించేందుకు శంకరనాథ్ యింటికి వెళ్ళాడు. మాటల సందర్భంలో గోపీని పళ్ళ బుట్టతో అక్కడికి పంపినట్లు చెప్పాడు. గోపీయే తన డబ్బు దొంగలించాడనే నమ్మకం రవికి కల్గింది. రవి వెంటనే జూదపు శాలకు పరుగెత్తాడు. అక్కడ అతని డబ్బు గోపీ చేతుల్లో కనిపించింది. "ఇది నేను కష్టపడి సంపాదించిన డబ్బు! నాకు బహుమతిగా లభించిన డబ్బు! దీన్ని తిరిగి లాక్కునేందుకు నా ప్రాణాలను సైతం పణంగా పెడతాను!" అంటూ రవి తన డబ్బు లాగుకునేందుకు జూదగాళ్ళతో కలియబడ్డాడు. గోపీ కూడా అతడికి సహాయపడ్డాడు. సరైన సమయంలో శంకరనాథ్, సీతారాంలు కూడా అక్కడికి చేరారు. గోపీ స్నేహితులంతా విస్మితులై చూస్తూ వుండిపోయారు.

సీతారాం గోపీని కర్రతో బాదాడు. శంకరనాథ్ అతన్ని శాంతపరుస్తూ, "సీతారాం, అల్లారుముద్దుగా పెంచడంతో పిల్లలు చెడిపోతారు. కాని కర్రతో బాదినంత మాత్రాన వారు బాగుపడరు సుమా!" అన్నాడు.

"గోపీ, నీవు తృణప్రాయంగా తగలేస్తున్న డబ్బును కూడబెట్టేందుకు నీ తల్లిదండ్రులెంత శ్రమిస్తున్నారో నీ వెప్పుడైనా అర్థం చేసుకునేందుకు ప్రయత్నించావా? ఈ డబ్బంతా చెమటోడ్చి సంపాదిస్తారని తెలుసుకో, నాయనా! ప్రతి తల్లీ, తండ్రీ తమ సంతానం అన్ని విధాలా సుఖపడాలనే కలలు కంటారు. ఆ కలలను సార్థకం చేసే బాధ్యత మీ పిల్లలు అందరిపైనా ఉంది.



వారు తమ అవసరాలను సైతం లక్ష్యం చేయకుండా మిమ్మల్ని స్కూలు, కాలేజీలలో చదివిస్తారు. మీరు జీవితంలో గొప్ప వాళ్ళు కావాలని ఆకాంక్షిస్తారు. కాని, మీరు దొంగలూ, జూదగాళ్ళూ కావడం వారి పట్ల అన్యాయం చేయటం కాదా? ఒక్కసారి మీ రంతా బాగా ఆలోచించండి," అన్నాడు శంకరనాథ్.

గోపీకి జ్ఞానోదయ మయింది. శంకరనాథ్ కాళ్ళపై బడి క్షమాపణ కోరుకున్నాడు.

శంకరనాథ్ ఇల్లు చేరి, ఆనందంతో ఉప్పొంగిపోతూ అన్నాడు: "నేడు మనకు శుభదినం. అందరూ తాము పోగొట్టుకున్న వన్నీ తిరిగి పొందగల్గారు. రవికి తన డబ్బు దొరికింది. బావగారికి తాను పోగొట్టుకున్న కుమారుడు లభించాడు. నాకు ప్రమోషను ఆర్డరు వచ్చింది. రవీ, ఇక నీవు నీ యిష్టం వచ్చినప్పుడు అజంతా, ఎల్లోరాలకు బయలు దేరవచ్చు. నాయనా! రాజాకు సైకిలు కొని యిస్తాను. రూపాకు కొత్త టెర్లిన్ ఫ్రాక్ కొంటాను."

పిల్లలంతా ఉత్సాహంతో గంతులేస్తూ ఏకస్వరంతో, "నాన్నా, మాకేమీ అక్కర లేదు. డబ్బు సంపాదించడం ఎంత కష్టమో, దాన్ని ఖర్చు చేయడం ఎంత సులభమో మేము బాగా అర్థం చేసుకోగల్గాం. మంచం ఉన్నంత వరకే కాళ్ళు చాపుకోవాలి. శక్తికి మించి ఖర్చు చేయకూడదు," అన్నారు.

నేడు శంకరనాథ్ అందరికంటే ఆనందంగా ఉన్నాడు. ఎందుకంటే, అతడు తన ఇంటిని స్వర్గం చేసుకోగల్గాడు!





# సజ్జనుడి పాట్లు

## 2

అత్తఫ్ చిరునవ్వు నవ్వి జఫర్ కేసి తిరిగి, "అన్నా, మీరు నిశ్చింతగా ఉండండి. ఈ వ్యవహారం నేను సానుకూలపరుస్తాను. ఆమె కుటుంబం నాకు బాగా తెలును. ఆమెకు ఇటీవలనే ఆమె భర్త విడాకు లిచ్చాడు. నే నిప్పుడే వెళ్ళి వాళ్ళతో మాట్లాడి వస్తాను." అంటూ ఇంటి నుంచి బయలుదేరాడు.

అతను తిన్నగా తన మామగారి ఇంటికి వెళ్ళి, మామగారిని కలుసుకుని, "నాకు తీర్థయాత్ర మీద బుద్ధి మళ్ళింది. నేను మక్కా వెళ్ళి, కాబా వద్ద నల్లరాతిని ముద్దు పెట్టుకుని, అక్కడి నుంచి మదీనా వెళ్ళి, ప్రవక్తగారి సమాధిని దర్శించి తిరిగి వస్తాను. ఈ ప్రయాణం తలపెట్టినవాడు బంధాలనూ, బాధ్యతలనూ వదిలించుకో వటం మంచిది. అందుచేత నేను నా భార్యకు విడాకులు ఇవ్వదలిచాను. లేక పోతే నాకు శాంతి ఉండదు," అన్నాడు.

అతని మామగారు ఆందోళనగా, "అంత గండగత్తెర ఏం వచ్చింది, నాయనా? నువు ఎంత కాలానికి తిరిగి వచ్చినా నీ భార్య నీ కోసం వేచి ఉండదా? ఈ భాగ్యానికి విడాకు లెందుకు? ఆమె నీ కోసం ప్రాణాలు విడుస్తుంది గద!" అన్నాడు.

కాని అత్తఫ్ తన భార్యకు విడాకులు ఇవ్వనే ఇచ్చాడు. అందుకు అతని భార్యా, మామా చాలా దుఃఖించారు. అక్కడి నుంచి అతను ఇంటికి తిరిగి వచ్చి జఫర్‌తో, "అన్నా, మీ సమస్య పరిష్కరించాను. ఆమె విడాకులు పుచ్చుకున్న మాట నిజమే. మీ రిక నిశ్చింతగా ఉండవచ్చు. మీ వివాహం తప్పక జరుగుతుంది. అయితే అందుకుగాను ఒక నాటకం ఆడాలి. లేక



పోతే ఆమె తండ్రి, ఎవరో ఊరూ పేరూ లేనివాడి కోసం నేను ఆమె వివాహం ఏర్పాడు చేస్తున్నా ననుకోగలడు. అందుకని నా ఆలోచన ఏమంటే: ఊరి వెలపల నేను కొన్ని గుడారాలూ, సిబ్బందీ, బోలెడన్ని గుర్రాలూ ఏర్పాటు చేస్తాను. మీరు రహస్యంగా వెళ్ళి ఆ డేరాలలో కొద్దికాలం ఉండండి. బాగ్దాదు నుంచి ఖలీఫా ప్రతినిధి వజీర్ జఫర్‌గారే స్వయంగా వేంచేశారని ఊళ్ళో పుకారు లేవదీస్తాను. ఈ మాట కాజీగారికీ, వలీగారికీ, పాలనాధికారికీ తెలియగానే వాళ్ళంతా పరిగెత్తుకుంటూ మీ దర్శనం కోసం వస్తారు. వారిని వారివారి హొదాలకు తగినట్టుగా మీరు పరామర్శించండి. వారు మీ వద్ద ఉండగానే నేను కూడా వస్తాను. అప్పుడు మీరు గాలి మార్పు కోసం వచ్చాననీ, ఫలాని అమీర్‌గారి కుమార్తె చాలా అందగత్తె అని విన్నాననీ, ఆమెను వివాహమాడ గోరుతున్నాననీ మాటల సందర్భంగా అనండి. అలా చేస్తే మీ పని సానుకూల మవుతుంది," అని ఆలోచన చెప్పాడు.

నిజానికి, తన అతిథి సాక్షాత్తూ బాగ్దాదు వజీరైన జఫరే అని అత్తఫ్ ఏమాత్రమూ ఎరగడు.

మర్నాడు ఉదయం ఇద్దరూ గుర్రాల మీద నగరం వెలపలకు వెళ్ళారు. తరవాత అత్తఫ్ తిరిగి వచ్చి నగరం వెలపలకు గుర్రాలనూ, కంచరగాడిదలనూ, ఒంటెలనూ, కావడిపెట్టెలలో అమూల్యమైన వస్తువులనూ, బానిసలనూ ఇతర నౌకర్లనూ, అంతులేని వెండిబంగారాలనూ చేర్పించాడు. జఫర్‌కు వజీర్‌లు ధరించే దుస్తులు తొడిగాడు. ఈ ఏర్పాట్లన్నీ పూర్తి అయాక అతను నగరపాలకుడికి, హరూనల్ రషీద్ గారి ప్రతినిధి డమాస్కస్ నగరానికి వచ్చి చేరుతున్నట్టు తన నౌకర్ల ద్వారా కబురు పంపాడు.

నగరపాలకుడు వెంటనే పెద్దలను పదిమందినీ పోగుచేసుకుని ఊరి వెలపల ఉన్న గుడారాల వద్దకు వచ్చి, జఫర్‌ను కలుసు

కుని, వంగి వంగి సలాములు చేసి, "ప్రభూ, తమరు వస్తున్నట్టు ముందుగా తెలియబరచి నట్టయితే తమకు ఘనంగా స్వాగతం ఏర్పాటు చేసి ఉందుమే!" అన్నాడు.

దానికి జఫర్, "అదంతా అవసరం లేదు. నేను గాలి మార్పు కోసం బయలు దేరి వచ్చాను. నా వివాహం కాగానే తిరిగి పోతాను. ఫలానా అమీర్‌కు అందమైన కుమార్తె ఉన్నదని విన్నాను. మా కిద్దరికీ వివాహం జరిగే లాగు మీరు మాటలు జర పాలి," అన్నాడు.

"తమ ఆజ్ఞ! ఆమె భర్త పుణ్యక్షేత్రాలు సేవించబోతున్న కారణంగా ఆమెకు ఇటీవలనే విడాకులు ఇచ్చాడు. అందుచేత తమ వివాహానికి అంతరాయమేమీ ఉండదు," అన్నాడు నగరపాలకుడు.

ఆయన వెంటనే అత్తఫ్ మామగారైన అమీర్ వద్దకు వెళ్ళి, "వజీర్ జఫర్‌గారు మీ కుమార్తెను పెళ్ళాడగోరి వచ్చారు," అని చెప్పాడు.

అమీర్ చేసేదేమీలేక, "చిత్తం!" అన్నాడు.

జఫర్ వివాహం సక్రమంగా జరిగింది. కాజీ వచ్చి సాక్షుల ఎదట వివాహపత్రం రాశాడు. జఫర్ పెళ్ళికూతురికి పది పెట్టెల నగలూ, పది సంచుల దీనారాలూ కట్నం ఇచ్చాడు. ఇవన్నీ అత్తఫ్ అరువిచ్చినవే!

పెళ్ళి విందు ముగియగానే జఫర్ బాగ్దాదుకు తిరుగు ప్రయాణం కట్టాడు. జఫర్





వెంట పెద్ద పరివారం బయలుదేరింది. పెళ్ళికూతురిని మేనాలో ఎక్కించారు.

డమాస్కస్ నుంచి పూట ప్రయాణం దూరం వచ్చాక జఫర్ వెనక్కు తిరిగి చూసేసరికి ఎవరో గుర్రం మీద తమవేపు వేగంగా వస్తూండటం కనిపించింది. ఆ వచ్చేది అత్తఫ్ అని గుర్తించగానే జఫర్ బిడారును నిలిపి, తన గుర్రం మీది నుంచి దిగాడు.

అత్తఫ్ జఫర్‌ను కౌగలించుకుని, "అన్నా, మీకు దూరం కావటం చాలా బాధాకరంగా ఉన్నది. మనం కలుసుకోక పోయినా బాగుండేదేమో గాని, ఎడబాటు భరించరానిదిగా ఉన్నది," అన్నాడు.

"తమ్ముడూ, నీ రుణం ఎన్నటికీ తీరేది కాదు. త్వరలోనే మనం శాశ్వతంగా కలుసుకునేటట్టు చేయమని అల్లాను ప్రార్థిస్తున్నాను," అని జఫర్ అక్కడే తివాసీలు పరిపించి, భోజనపానీయాలు ఏర్పాటుచేశాడు.

"అన్నా, విడవకుండా ఉత్తరాలు రాస్తూ ఉండాలి. నాకు ప్రతి విషయమూ, వెంట ఉన్నట్టుగా తెలియాలి," అని అత్తఫ్ వెనక్కు తిరిగి వెళ్ళిపోయాడు.

అయితే, మేనాలో ఉన్న పెళ్ళికూతురు తల బయటికి పెట్టి, తన పాతభర్తా, కొత్త భర్తా కలుసుకోవటమూ, మాట్లాడుకుంటూ తినడమూ, తాగడమూ చూసి, "ఈ మనిషి నా కానాడు కనిపించి పద్యాలు చదివినవాడే! ఇతనూ, నా భర్తా స్నేహితులన్నమాట. ఇతను నన్ను ప్రేమించినట్టు తెలుసుకుని, ఉదారుడైన నా భర్త నన్ను అతని పరం చేశాడు," అనుకుంటూ కన్నీరు కార్చింది.

బిడారు మళ్ళీ ప్రయాణం సాగించగానే జఫర్ మేనాను చేరవచ్చి, "సుందరీ, మా ప్రాణాలు హరించేశావు!" అన్నాడు.

"మీరు నాతో మాట్లాడటం భావ్యం కాదు. మీ మిత్రుడైన అత్తఫ్‌కు నేను భార్యను. అతనిలాటి ఉదారులు ఉండరు. మీలో ఏమాత్రం స్నేహభావం ఉన్నా నన్ను తిరిగి అతనికి ఇచ్చెయ్యండి," అన్నదామె.

జఫర్ ఆవేదనతో, ''ఇది నిజమా?'' అన్నాడు.

''అవును, నిజం! మీరు నన్ను కిటికీ వద్ద చూసి మోహం చెందిన సంగతి విని, మీ దారికి అడ్డం ఉండలేక అతను నాకు విడాకు లిచ్చాడు,'' అన్న దామె.

''నాకు నీ మీద ఎలాటి హక్కూ లేదు. కాని, బాధ్యత ఉన్నది,'' అని జఫర్ ఆమె రక్షణకు తన నౌకర్లను నియోగించి, వేగంగా బాగ్దాదుకు ప్రయాణం సాగించాడు.

ఈ లోపుగా బాగ్దాదులో ఖలీఫా, జఫర్ విషయంలో తాను తొందరపడి నోరు జారి నందుకు ఎంతగానో పశ్చాత్తాప పడ్డాడు; జఫర్ ఎక్కడ ఉన్నదీ ఆచూకీ తీయమని మనుషులను అన్ని వైపులకూ పంపాడు. కాని ప్రయోజనం లేకపోయింది.

అందుచేత, జఫర్ పెద్ద పరివారంతో తిరిగి వస్తున్నా డన్న వార్త వినగానే ఖలీఫా పరమానందంతో ఎదురు వెళ్ళి, కౌగలించు కున్నాడు. వారిద్దరూ రాజభవనానికి వచ్చి, అక్కడ చాలాసేపు మాట్లాడుకున్నారు.

జఫర్ చెప్పినదంతా విని ఖలీఫా, ''నీ కొత్త మిత్రుడు పరిచయం చేసుకోదగిన వాడే. నువు నీ వివాహం రద్దు చేసుకుని, ఆమెను క్షేమంగా ఆమె భర్త వద్దకు చేర్చ వలసి ఉన్నది. అతని స్నేహం విలువైనది. నీ స్నేహితుణ్ణి బాగ్దాదుకు పిలిపిద్దాం.



ఔదార్య మంటే ఏమిటో అతని నుంచి మనమందరమూ నేర్చుకోవాలి,'' అన్నాడు.

ఖలీఫా సలహా పై జఫర్ తాను పెళ్లాడిన స్త్రీని ఒక రమ్యమైన భవనంలో ఉంచి, ఆమె కొరకు బానిసలూ, తివాసీలూ, పింగాణీ పాత్రలూ మొదలైనవన్నీ అమర్చాడు. తాను ఆ ఇంటి చాయలకు పోకపోయినా, రోజూ, ఆమె క్షేమసమాచారాలు తెలుసుకుంటూ, ఖర్చుకుగాను నెలకు వెయ్యిదీనారాల చొప్పున డబ్బు పంపాడు.

డమాస్కస్‌లో అత్తఫ్ పేరు అందరి నోటా నానసాగింది. అది చూసి అతనంటే గిట్టనివాళ్ళు నగరపాలకుడి దగ్గిరికి వెళ్ళి, ''అత్తఫ్ మీకు ఎసరు పెడుతున్నాడు,



ఆ మాత్రం గ్రహించలేరా? అతను వజీరు గారి స్నేహితుడు. అయనను మనందరి కన్నా ఎక్కువ దూరం సాగనంపి, మిమ్మల్ని తొలగించి తనను పురపాలకుడుగా నియమించేటట్టు ఖలీఫాతో చెప్పమన్నాడట! జఫర్ సరే నన్నాడట! అతను దెబ్బ తీసే లోపల మీరే ముందు దెబ్బతీయటం మంచిది,'' అన్నారు.

''అదీ నిజమే!'' అని పురపాలకుడు వెంటనే అత్తఫ్ ఇంటి మీదికి కొందరు గూండాలను తోలాడు.

వాళ్ళు కత్తులూ, కర్రలూ తీసుకునిపోయి, ఏ పాపమూ ఎరగని అత్తఫ్ మీద పడి, నెత్తురు కారేటట్టు అతన్ని కొట్టి, అతని ఇల్లు కొల్లగొట్టి, అతన్ని నగరపాలకుడి వద్దకు ఈడ్చుకు వచ్చారు.

''ఏమిటి నేను చేసిన నేరం?'' అని అత్తఫ్ అడిగితే, అతని శత్రువులు, ''నగర పాలకుడికే ద్రోహం తలపెట్టితే అల్లా చూస్తూ ఊరుకుంటాడా?'' అన్నారు.

పురపాలకుడు అత్తఫ్ తల నరకమని ఉత్తరు విచ్చాడు. అత్తఫ్ ఒంటి మీద ఉన్న బట్టలో నుంచి ఒక పీలిక చించి, దానితో అతని కళ్ళకు గంత కట్టారు. తీరా అతని తల తెగబోయే సమయానికి నగరంలోని అమీర్లలో ఒకడు అడ్డపడి నగరపాలకుడితో, ''ఎందుకు తొందరపడి అతన్ని శిక్షిస్తారు? అతని పైన ఆరోపణలు చేసిన వారు అబద్ధా లాడారేమో! అదీగాక, వజీర్ జఫర్ అతని మిత్రుడైనప్పుడు ఇవాళ అతని తలకు పట్టిన గతే రేపు మీ తలకు పట్టదా?'' అన్నాడు.

నగరపాలకుడికి నిద్రమత్తు వదిలినట్టయింది. ఆయన అత్తఫ్‌కు విధించిన మరణదండనను రద్దు చేసి, అతన్ని ఖైదులో పెట్టించాడు. అత్తఫ్ తాను నిర్దోషినని ఎంతగా మొరపెట్టినా అది అరణ్యరోదన అయింది.

ఖైదులో పడిన అత్తఫ్ ఒకనాటి రాత్రి నిద్ర లేచి చూసేసరికి అతని కొట్టు తలుపు సరిగా మూసి లేదు. ఆ సాయంత్రం అతనికి

తిండీ, నీరూ తెచ్చిన భటుడు తలుపు తాళం పెట్టడం మరిచిపోయాడు. ఆ అవ కాశం ఉపయోగించుకుని అత్తఫ్ అతి జాగ్రత్తగా ఖైదు నుంచి బయటపడి, నగర ద్వారం చేరుకుని, తెల్లవారుఝామున నగరద్వారం తెరవగానే జనంలో కలిసి నగరం దాటి ప్రయాణమయాడు.

అత్తఫ్ ఎన్నో కష్టాలు పడి అలెప్పో నగరం చేరి, అక్కడి పెద్ద మసీదుకు వెళ్లి, బాగ్దాదుకు వెళుతున్న ప్రయాణీకులతో పరి చయం చేసుకున్నాడు. అతను వారితోనే కలిసి ప్రయాణం చేసి, నెలలోపుగా బాగ్దాదు చేరుకున్నాడు. చిరిగి, దుమ్ము కొట్టుకున్న తలపాగా, పెరిగిన గడ్డమూ, జడలు కట్టిన జుట్టూ కలిగి అతను దీనంగా కనిపిస్తూ, బాగ్దాదు వీధుల వెంబడి నడిచి, తనకు కనిపించిన మొదటి మసీదులోకి వెళ్ళాడు.

అక్కడ అతను తన హీనస్థితిని తలుచు కుంటూ కూర్చుని ఉండగా, ఒక అడుక్కు తినేవాడు వచ్చి అతనికి ఎదురుగా చతికిల బడి, తన సంచీలో నుంచి రొట్టెలూ, కోడి కూరా, పచ్చళ్లూ, పళ్లూ, ఖర్జూరాలూ పైకి తీసి వాటిని తినసాగాడు. రెండురోజులుగా తిండి లేక మాడుతున్న అత్తఫ్‌కు ఆ బిచ్చ గాడు తినేవి పంచభక్ష్యపరమాన్నాల లాగా తోచాయి.

అడుక్కుతినేవాడు అతని చూపులు గ్రహించి, తల అడ్డంగా తిప్పుతూ, "కళ్లతో ఎందుకు యాచిస్తావు? నువు ఏడిచి రాగాలు పెట్టినా నీకు ఒక్క తుంపు కూడా పెట్టను.



నీకు మంచి తిండి తినాలని ఉంటే పెద్ద వజీరు జఫర్‌గారింటికి వెళ్ళు. ఆయనకు డమాస్కస్‌లో ఎవరో అత్తఫ్ అనేవాడు గొప్పగా ఆతిథ్యం ఇచ్చాడట. అందుకని జఫర్‌గారు అడ్డమైనవారికీ తిండి పెడు తున్నాడు. ఆయన పొద్దున్నే లేస్తూనే అత్తఫ్ పేరు తలుచుకుంటాడట. ఆ పేరు తలుచు కోకుండా రాత్రి నిద్రపోడుట," అన్నాడు.

"అల్లా, నీ మహిమ మళ్ళీ చూపిం చావా!" అనుకున్నాడు అత్తఫ్.

అతను కాగితాల దుకాణానికి వెళ్లి ఒక తెల్లకాగితం ముష్టి ఎత్తి, కలం అరువు తీసు కుని, ఆ కాగితం మీద ఇలా రాశాడు:

"మీ తమ్ముడు అత్తఫ్ వ్రాయునది: ప్రపంచాధిపతి కూడా విర్రవీగరాదు, ఎందు కంటే అతను ఒక్క పూటలో బూడిదలో పొర్లవచ్చు. ఇప్పుడు చూస్తే మీరు నన్ను గుర్తించలేరు. దారిద్ర్యమూ, దైన్యమూ, ఆకలీ, దప్పీ, దీర్ఘ ప్రయాణమూ నన్ను శవప్రాయుణ్ణి చేసినవి. నేను మీ కోసం వచ్చాను. మీకు స్వస్తి కలుగుగాక!"

ఇలా ఉత్తరం రాసి అత్తఫ్, జఫర్‌గారి ఇంటికి దారి విచారిస్తూ వచ్చి, బయటి వాకిలికి కొంత దూరంగా నిలబడ్డాడు. ద్వార పాలకులు అతని కేసి మౌనంగా చూశారు. అతను వారి కేసి చూశాడు. ఇలా నిలబడ టానికి సిగ్గువేసి అతను వెళ్ళిపోదా మను కుంటూండగా ఒక కొజ్జావాడు, నడుముకు వెడల్పయిన బంగారు పట్కా తగిలించు కుని అతని పక్కగా వెళ్ళాడు.

అత్తఫ్ సాహసించి ఆ కొజ్జావాడి చెయ్యి పట్టుకుని, "అయ్యా, ఈ ఉత్తరం ఇంటి యజమాని కిచ్చి, వారి తమ్ముడు అత్తఫ్ బయట ఉన్నట్టు చెబుతారా?" అని వేడు కున్నాడు.

కొజ్జావాడు మండిపడుతూ, "దొంగ వెధవా, వజీరుగారి తమ్ముణ్ణి అంటావురా?" అంటూ బంగారుకట్టు గల చేతికర్రతో అత్తఫ్‌ను ముఖం మీద కొట్టాడు. ఆ దెబ్బకు అత్తఫ్ కింద పడిపోయాడు. అతని ముఖం నుంచి రక్తం కారసాగింది.

—(ముగింపు వచ్చే సంచికలో)





# కీర్తికిదారి

ధవళగిరి పాలించిన చంద్రసేన మహా రాజుకు సన్యాసులంటే అమితమైన భక్తి. అందుచేత ఆయన వద్దకు తరచుగా సన్యాసులు వచ్చి, తత్వం గురించి చర్చ చేస్తూ ఉండేవారు. సన్యాసుల కోసం ఆయన తన దేశమంతటా మఠాలు కట్టించి, వారికి కావలసిన సదుపాయాలన్నీ ఏర్పాటు చేయించాడు.

అదే రాజ్యంలో సోమగిరి అనే ఒక వైద్యుడు ఉండేవాడు. అతగాడు మంది వ్వటం ప్రారంభించాక ఏ రోగీ ఎంతోకాలం బతకలేదు. ఆయన హస్తవాసి మంచిది కాదని ఆయనను ఊరి వాళ్ళు వెళ్ళగొట్టారు. ఆయన ఇంకా అనేక గ్రామాలలో వైద్యం చేసుకుని బతుకుదామని చూశాడు గాని, అన్నిచోట్లా ఇలాగే జరిగింది.

ఇక వైద్యం అచ్చి రాదనుకుని సోమగిరి దేశంలో అన్ని వృత్తుల వాళ్ళకంటె కూడా సన్యాసులకు సుఖంగా జరుగుబాటు అవుతున్నది గనక సన్యాసిగా బతకనిశ్చయించి, సన్యాసం పుచ్చుకున్నాడు.

ధవళగిరి రాజ్యంలో మామూలు సన్యాసుల కన్న మఠాధిపతులకు బాగా గిట్టుబాటు అవుతుంది. మఠానికి రాజుగారు అప్పుడప్పుడూ ఇచ్చే ధనం మఠాధిపతుల అధీనంలో ఉంటుంది. మిగిలిన సన్యాసులను అదుపు చేయగలవాడు మఠాధిపతి అవుతాడు.

అందుచేత సోమగిరి, అందరు సన్యాసుల లాగా జింకచర్మం చంకన పెట్టుకోక, పులితోలు సంపాదించి, ఒక మారుమూల మఠానికి వెళ్ళి, అక్కడి మఠాధిపతిని అదరగొట్టటానికి చరకంలో నుంచీ, శుశ్రుతంలో నుంచీ శ్లోకాలు చదివి, అందరిచేతా మెప్పుపొంది, ఆ మఠానికి తానే అధిపతి అయాడు.

ఎల్. రాజేంద్రప్రసాద్

మఠాలకు రాజు ఏటా పంపించే వార్షి కాలు మఠాధిపతి అధీనంలోనే ఉంటాయి. అదీగాక, చుట్టుపట్ల గ్రామాలలో ఉండే పెద్దలు అప్పుడప్పుడూ సన్యాసులకు భిక్షలు చేసి, సొమ్ము ఇస్తూంటారు. ఇలాటి దానాలు కూడా మఠాధిపతి చేతిలోనే ఉంటాయి. అందుచేత సోమగిరి కొంతకాలం పాటు చాలా డబ్బు పోగుచేశాడు.

ఇంతలో ఆ మఠానికి సోమగిరి తలదన్నిన మరో స్వాములవారు సింహంతోలు చంకన పెట్టుకుని వచ్చి, సోమగిరికి తత్వజ్ఞానం ఏమీ లేదని రుజువు చేసి, తానే మఠాధిపతి అయి కూర్చున్నాడు.

తరవాత సోమగిరి ఆ మఠం వదిలేసి, ఇతర మఠాలలో తన పాచిక పారుతుందేమో నని చూశాడు. కాని అంతటా గడుసువాళ్ళు తిష్ఠవేసి ఉండటం చేత సోమగిరి నిస్స హాయుడయాడు.

దీనికితోడు సోమగిరి ఆరోగ్యం దెబ్బ తిన్నది. సన్యాసులకు వైద్యసహాయం కూడా రాజు చేసిన ఏర్పాట్లలో ఉన్నది. అయితే, ఏ మఠంలోనూ రోగులకు ఉచితంగా వైద్య సహాయం జరగటం లేదు. సోమగిరి వద్ద డబ్బున్నది గాని, దాన్ని అతను ఖర్చుపెట్ట దలచలేదు.

రాజధానిలో మఠాలలో తనకు బాగా జరుగుబాటు అవుతుందనుకుని, సోమగిరి జబ్బుతోనే ఎలాగో ధవళగిరి చేరుకుని, ఒక పెద్ద మఠంలో వచ్చి పడ్డాడు. అతను అక్కడ చేరిన క్షణంనుంచీ అతని వ్యాధి



ముదిరింది. అక్కడి మఠాధిపతి సోమగిరి వద్ద ఉన్న డబ్బంతా స్వాధీనపరుచుకుని, మనుషులను పెట్టి సోమగిరికి పరిచర్యలు జరిపించాడు.

సోమగిరి రోగం అంత కంతకూ ముదిరింది. అతను ఎంతోకాలం బతకడని తేలిపోయింది.

మఠాధిపతి ఒక రాత్రి తన సన్నిహితులతో, "ఈ సన్యాసి ఇంకొక్క రోజుకన్న బతకడని తోస్తుంది. తెల్లవారగానే ఇతన్ని రాజభవనం దగ్గిర ఉన్న మఠానికి పంపేద్దాం. లేకపోతే మనకు చాలా ఖర్చు ఉంటుంది." అన్నాడు.

కాని సోమగిరి మఠంవాళ్లను మోసగించి, ఆ రాత్రే ప్రాణాలు విడిచాడు.

మఠాధిపతికి గుండె గుభేలుమన్నది. ఏ మఠంలో సన్యాసి నిర్యాణం చెందితే, ఆ మఠమే ఉత్తరక్రియల ఖర్చులు భరించాలి. ఈ ఖర్చు తప్పించుకునేటందుకు మఠాధిపతి ఆ రాత్రంతా బాగా ఆలోచించి ఒక యుక్తిపన్నాడు.

ఆయన తన ప్రధాన శిష్యులను వెంట బెట్టుకుని చంద్రసేన మహారాజును చూడబోయి, "మహారాజా, నిన్నరాత్రి త్రిజగద్గురు సోమగిరిస్వామివారు మా కందరికీ తత్వోపదేశంచేసి, యోగాసనం వేసుకుని, స్వచ్ఛంద మరణం పొంది, పరమపదానికి వేంచేశారు. వారు అనేక మఠాలు సందర్శించి, మన మఠాన్ని తమ నిర్యాణానికి తగినదిగా ఎన్నుకున్నారట. ఈ విధంగా వారి పాద స్పర్శచేత పావనమైన మన మఠానికి తమరు ప్రత్యేకత ఇచ్చి, వారి పేర ధారాళంగా ఉత్సవాలూ, వేదపాఠశాలలూ, తత్వగోష్ఠులూ ఏర్పాటు చెయ్యటం సముచితంగా ఉంటుంది," అని చాలాసేపు ఉపన్యాసం చేశాడు.

మఠాధిపతి ఎత్తుపారింది. రాజు అంతు లేని ధనం మఠాధిపతికి మంజూరు చేసి, సోమగిరిస్వామివారి పేర పాఠశాలలూ, భజనమందిరాలూ, ఏటా ఉత్సవాలూ మొదలైనవి ఏర్పాటు చేశాడు. సోమగిరి చచ్చి దేవుడంత కీర్తి సంపాదించుకున్నాడు.



# మర్యాదకు పోతే-

ఒక రాజుగారి కుమార్తెకు వివాహం నిశ్చయమయింది. రాజుగారు ముఖ్యులను కొందరిని ఆహ్వానించి విందు వినోదాలు ఏర్పాటు చేశాడు. వినోదాలు జరిగే సావళ్లో మధ్యగా ఒక బల్ల ఉంచి, దాని మీద ఒక వెండి పళ్ళెంలో రాజకుమార్తె ప్రధానపు ఉంగరం ప్రదర్శనకు పెట్టారు. అతిథులు అటూ ఇటూ తిరుగుతున్నారు.

ఉన్నట్టుండి మంత్రిగారు బల్ల కేసి చూసి, దాని మీద ఉన్న వెండి పళ్ళెంలో ఉంగరం లేకపోవటం గమనించాడు. ప్రధానపు ఉంగరాన్ని అతిథులలో ఎవరో తస్కరించారు. అందరూ పెద్దలే. అందరినీ సోదా చెయ్యవచ్చు గాని రసాభాస అవుతుంది. పోయిన ఉంగరాన్ని మంచిగానే తిరిగి తెప్పిద్దామనుకుని మంత్రిగారు అతిథులతో, "మహాజనులారా, మనలో ఎవరో రాజకుమార్తె ప్రధానపు ఉంగరం తీశారు. ఒక్కరు చేసిన నేరానికి అందరినీ సోదా చెయ్యటం బాగుండదు. అందుచేత, ఒక్క నిమిషం సేపు దీపాలు ఆర్పించేస్తాను. తిరిగి దీపాలు వెలిగే లోపుగా, ఉంగరం తీసినవారు దాన్ని యథాస్థానంలో ఉంచండి," అన్నాడు.

దీపాలు ఆరిపోయి మళ్ళీ ఒక నిమిషం తరువాత వెలిగాయి.

మంత్రి బల్ల కేసి ఆత్రంగా చూశాడు. బల్ల మీద ఉండిన వెండి పళ్ళెం కూడా మాయమయింది!

—కె. వి. అనందమూర్తి





# శాస్త్రిగారి కోడళ్ళు

పూర్వం భోజరాజు ఆస్థానంలో సోమశాస్త్రి అనే పండితుడు ఉండేవాడు. ఆయనకు ముగ్గురు కుమారులు. శాస్త్రిగారు తన కుమారులకు మంచి తెలివి తేటలూ, మాటకారితనమూ, సద్గుణాలూ గల కన్యలను తెచ్చి పెళ్ళి చేశాడు. వాళ్ళు అత్త మామలను సేవిస్తూ, భర్తలను పూజిస్తూ, అక్క చెల్లెళ్ళ కన్న అన్యోన్యంగా ఉంటూ, తమలోతాము చతురంగా మాటాడుకునేవారు.

భోజరాజుకు మారువేషంలో సాయంకాలంవేళ నగరంలో తిరిగే అలవాటు ఉండేది. ఒక రోజు చీకటి పడేవేళ అయన సోమశాస్త్రిగారి ఇంటి ప్రాంతానికి వచ్చేసరికి, శాస్త్రిగారి కోడళ్ళు డాబా మీద కూర్చుని మాట్లాడుకుంటూ ఉండటం వినిపించింది. రాజు వారి సంభాషణ ఆలకించాడు.

ఆ సాయంకాలం శాస్త్రిగారి కోడళ్ళు పనులన్నీ ముగించి, చల్లగాలికి డాబా మీద చేరేసరికి, దూరంగా ఎవరో మద్దెల బహు చక్కగా వాయిస్తూ ఉండటం వాళ్ళకు వినిపించింది.

ఆ వాయింపు కొంతసేపు విన్నాక పెద్ద కోడలు, "చచ్చినది ఎంత కమ్మగా ఉన్నదో!" అన్నది.

"అంతే కాదు, వేళావిశేషం కూడా కలిసివచ్చింది లేవే, అక్కయ్యా," అన్నది రెండో కోడలు.

"వేళావిశేషానికి తగినట్టు హస్తవాసి కూడా మహామంచిది," అన్నది మూడో కోడలు.

రాజుకు ఈ మాటలు ఆశ్చర్యాన్ని కలిగించాయి. ఆయన రాజభవనానికి తిరిగి వెళ్ళి, మంత్రిని పిలిపించి, ఆయనకు శాస్త్రిగారి కోడళ్ళ సంభాషణ చెప్పి, "ఈ మాటలకు అర్థం ఏమై ఉంటుంది?" అని అడిగాడు.

జి. సుగుణవతి

మంత్రి అంతా విని, "ఆ అమ్మాయిలు చక్కగా వండిన మాంసం తిని, దాన్ని గురించి మాట్లాడు కుంటున్నారు, మహా రాజా!" అన్నాడు.

శాస్త్రిగారి కోడళ్ళు మాంసం తినటమే గాక దాన్నిగురించి కూడా చెప్పుకుంటారా? నిజం తెల్చుకోవాలని రాజు మర్నాడు ఆ ముగ్గురినీ తన భవనానికి పిలిపించి, మంత్రి చేత వారిని అడిగించాడు.

మంత్రి ఆ అమ్మాయిలను, "నిన్న సాయంకాలం మీరు మీ ఇంటి డాబామీద కూర్చుని ఇలా ఇలా మాట్లాడుకున్నారు. ఆ మాటలకు అర్థమేమిటో రాజుగారు తెలుసుకో గోరుతున్నారు. చెబుతారా?" అని అడిగాడు.

తోడికోడళ్ళు ఆశ్చర్యంగా ఒకరి మొహాలు ఒకరు చూసుకోవటం గమనించి, మంత్రి తన ఊహ సరిఅయినదేనని సంతోషించాడు.

ఇంతలో పెద్ద కోడలు మిగిలిన వాళ్ళతో, "దానిలాగా ఉన్నాదేమిటి?" అన్నది.

వెంటనే రెండో కోడలు, "మరి అవి ఏవీ?" అన్నది.

మూడో కోడలు, "అవి ఉన్నవాటికి ఉంటాయి, లేనివాటికి ఉండవు!" అన్నది.

ఈసారి రాజూ, మంత్రీ ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

అప్పుడు రాజు పెద్ద కోడలితో, "అమ్మా, మీరు మాట్లాడేధోరణి మాకు బొత్తిగా అయోమయంగా ఉన్నది. నిన్న మీరు మీ డాబామీద కూర్చుని ఆడుకున్న మాటలు



దేన్నిగురించి? నా తృప్తి కోసం చెప్పండి,'' అన్నాడు, వినయంగా.

''మహారాజా, నిన్న సాయంకాలం చల్ల గాలికి డాబామీద చేరేసరికి ఎవరో చాలా చక్కగా మద్దెల వాయించుతూండటం విని పించింది. చచ్చిపోయిన జంతువు చర్మం నుంచి అంత చక్కని నాదం రావటం చూసి నేను, 'చచ్చినది ఎంత కమ్మగా ఉన్నదో!' అన్నాను. దానికి నా రెండో తోడికోడలు, మేము విని ఆనందించేవేళ కూడా కలిసి వచ్చింది గదా అన్నది. మా మూడో తోడికోడలు వాయించే వాడి హస్తవాసిని కూడా మెచ్చుకున్నది,'' అన్నది శాస్త్రిగారి పెద్ద కోడలు.

ఆ తోడికోడళ్ళ మాట చమత్కారానికి రాజు మెచ్చుకుని, ''మీరు మా మంత్రిని గురించి అన్నమాటలు కూడా వివరించండి,'' అని అడిగాడు.

''క్షమించండి, మహారాజా. అది వివ రించటం అంత మర్యాదగా ఉండదు. మా భాష మీకు అర్థంకాదన్న ధైర్యంతో అలా మాట్లాడుకున్నాం,'' అన్నారు శాస్త్రి గారి కోడళ్ళు.

''మీరు ఏమనుకున్నా శిక్షించనని అభయం ఇస్తున్నాను. మీ మాటలకు అర్థం చెప్పండి,'' అన్నాడు రాజు.

''మాలో మేం మాట్లాడుకున్న వాటి అర్థం తెలియకపోగా, అర్థం అడగటానికి మమ్మల్ని రాజభవనానికి రప్పించినందుకు మాకు కాస్త కోపం వచ్చింది, మహారాజా. అందుకని మమ్మల్ని ప్రశ్నించిన మంత్రి గొర్రెలాగున్నాడే అన్నాను,'' అన్నది పెద్ద కోడలు.

''గొర్రె అయితే కొమ్ములు లేవేమని నేను అడిగాను,'' అన్నది రెండో కోడలు.

''కొమ్ములు మగ గొర్రెలకుంటాయి, ఆడ గొర్రెలకు ఉండవు, అని నేనన్నాను. ఇలా అన్నందుకు మీరు మమ్మల్ని క్షమించాలి,'' అన్నది మూడో కోడలు.

రాజు వారిని క్షమించటమేగాక, ఆ ముగ్గు రికీ పసుపూ కుంకంతోబాటు మంచి కానుక లిచ్చి, వాళ్ళను గౌరవంగా పంపించేశాడు.



# హాస్యగాడు

ఒక రాజుగారి ఆస్థానంలో ఒక సుప్రసిద్ధ హాస్యగాడు ఉండేవాడు. అతని పేరు ప్రఖ్యాతులు దేశదేశాలా వ్యాపించటంచేత, పొరుగురాజు ఆ హాస్యగాణ్ణి కొద్ది రోజులపాటు తన దేశానికి పంపవలసిందిగా ఈ దేశపు రాజుకు విజ్ఞాపన పంపాడు. ఇద్దరు రాజుల మధ్యా స్నేహ సంబంధాలుండటంచేత ఈ దేశపు రాజు తన హాస్యగాణ్ణి ఆ దేశపు రాజు వద్ద వారం రోజులు అతిథిగా ఉండటానికి పంపాడు.

హాస్యగాడు కొద్ది పరివారంతో ఆ దేశపు రాజు వద్దకు వెళ్ళి, అక్కడ వారం రోజులుండి, తాను ఉన్నంతకాలమూ ఆ రాజు సభలో హాస్యం చెప్పి, అందరినీ నవ్వించాడు.

హాస్యగాడు తన దేశానికి తిరిగి వచ్చేముందు ఆ దేశపు రాజు అతన్ని, "మీ రాజుగారు గొప్పవాడా? నేను గొప్పవాణ్ణా?" అని అడిగాడు.

"మీకూ మా రాజుగారికీ పోలిక ఏమిటి? మీరు పున్నమిచంద్రులు; మా రాజుగారు అమావాస్యచంద్రులు," అన్నాడు.

హాస్యగాడు తిరిగివచ్చాక ఈ రాజుగారికి అతను అన్న మాట తెలియవచ్చింది. ఆయన హాస్యగాణ్ణి, "నన్ను అమావాస్యచంద్రుడితోనూ, అతన్ని పున్నమిచంద్రుడితోనూ ఎందుకు పోల్చావు?" అని అడిగాడు.

"మహారాజా, ఆ రాజుగారు రోజురోజుకూ క్షీణించేవాడు. తమ కాంతి రోజురోజుకూ పెరిగేది. అందుకని అలా అన్నాను," అన్నాడు హాస్యగాడు.






పాండవులు ఒక ఏడాదిపాటు అరణ్యవాసం చేసిన తరవాత అర్జునుడు ఇంద్రలోకానికి వెళ్ళాడు. అతను అక్కడి నుంచి తిరిగి రావటానికి అయిదేళ్ళు పట్టింది. అతను వచ్చిన అనంతరం మరి నాలుగేళ్ళపాటు వాళ్ళు గంధమాదన ప్రాంతంలోనే గడిపారు. కుబేరుడి అనుమతితోనూ, కుబేరుడు ఏర్పాటు చేసిన యక్షుల సహాయంతోనూ దివ్యమైన ఆ ప్రదేశాల సౌందర్యం తనివితీరా చూశారు. వారి అరణ్యవాసంలో పదేళ్ళు నిండి, పదకొండో ఏడు మొదలయింది. ఇంక త్వరలో పన్నెండేళ్ళు పూర్తి అవుతాయి. తరవాత వాళ్ళు అజ్ఞాతవాసం కూడా ముగించి కౌరవుల మీద పగ తీర్చుకుంటారు. పగ తీర్చుకునే సమయం కోసం ఆత్రంగా ఎదురుచూస్తున్నట్టు భీముడు ధర్మరాజుతో పైకే అనేశాడు. పైకి అనకపోయినా, అర్జున నకుల సహదేవులు కూడా ఆత్రంగానే ఉన్నారు.

ఈ సంగతి ధర్మరాజు గ్రహించి, ఈ దేవప్రాంతాలను విడిచి తిరిగి వెళ్ళటానికి నిశ్చయించాడు. భీముడు తలచుకోగానే ఘటోత్కచుడు తన అనుచరులతో సహా వచ్చి, పాండవులను వృషపర్వుడి ఆశ్రమానికి చేర్చాడు. అక్కడి నుంచి వారు బదరికారణ్యానికి వచ్చి, అందమైన ఆ అరణ్యంలో ఒక మాసం ఉండి, కిరాత దేశం చేరి, సుబాహుపురానికి వచ్చి పడ్డారు. ఇంద్రసేనుడూ, విశోకుడూ మొదలుగా గల పాండవ భృత్యులు ఒకప్పుడు అక్కడే

### 32. భీమ విమోచనం



దిగబడిపోయారు. అక్కడి నుంచి ఘటోత్కచుణ్ణీ, అతని అనుచరులనూ పంపేసి, తమ భృత్యులను కలుపుకుని కాలినడకన హిమాలయాలలో విశాఖయూపం చేరుకున్నారు.

ఈ ప్రాంతంలో వేటాడదగిన మృగాలు ఎన్నయినా ఉన్నాయి. వేట మీది వ్యామోహం కొద్దీ పాండవులు ఒక ఏడాది పాటు ఆ ప్రాంతంలోనే ఉండిపోయారు.

ఒకనాడు భీముడు తగిన ఆయుధాలు తీసుకుని వేటకు బయలుదేరి అనేక మృగాలను చంపుతూ వెళ్ళివెళ్ళి ఒక మహా సర్పాన్ని చూశాడు. అది ఆకుపచ్చ రంగులో ఉన్నది. దాని నోరు కొండగుహలాగున్నది. అందులో నాలుగు భయంకరమైన కోరలున్నాయి. దాని కళ్ళు ప్రకాశిస్తున్నాయి. దాని నోటి నుంచి విషజ్వాలలు వెలువడి, చుట్టూ ఉన్న చెట్లను మాడ్చేస్తున్నాయి.

అలాటి ప్రళయనాగును భీముడు పొగరుగా ఎదిరించాడు. వెంటనే అది భీముడి శరీరాన్ని బలంగా చుట్టివేసింది. వెయ్యి ఏనుగుల బలం గల భీముడు ఎంత ప్రయత్నించీ దాని పట్టు నుంచి తప్పించుకోలేక నిర్ఘాంతపోయాడు.

ఈలోపల ధర్మరాజు, భీముడెంతకూ తిరిగిరాకపోవటం చూసి, అతను బయలుదేరిన దిక్కు తెలుసుకుని, ద్రౌపదికి రక్షగా అర్జున నకుల సహదేవులను ఉండమని, ధౌమ్యుడితో సహా అరణ్యమార్గాన బయలుదేరాడు. దారి పొడుగునా, భీముడిచేత చచ్చిన మృగాలు గుట్టలుగా పడి ఉండటం చేత దారి వెతుక్కునే అవసరం లేకపోయింది.

అలా పోగా చివరకు ధర్మరాజుకు భీముడు పాము చుట్టలలో అసహాయుడై చిక్కి కనిపించాడు. అతను పోయి అలా పాము నోటిలో ఎందుకు చిక్కుకోవలిసిన అవసరం కలిగిందో ధర్మరాజుకు అర్థం కాలేదు. ఆయన పామును సంబోధించి, "సర్పరాజా, నీకు ఆహారం కావాలంటే



మరేదన్నా అడుగు, ఇస్తాను. ఇతను నా తమ్ముడు, ఇతన్ని వదిలిపెట్టు," అన్నాడు.

దానికా సర్పం, "అయ్యా, నాకు నీ తమ్ముడు దైవికంగా దొరికాడు. నేను అతన్ని వదలను. అతను నా ఆహారం. నువు కూడా ఇక్కడే ఉండిపోయేటట్టుంటే రేపు నిన్ను మింగుతా!" అన్నది.

ఈ జవాబు విని, "నువు ఎవరు?" అని ధర్మరాజు సర్పాన్ని అడిగాడు.

"నేను మీ పూర్వీకుణ్ణి. నా పేరు నహుషుడు. చంద్రుడికి ఏడోతరంవాణ్ణి. బతికి ఉండగా అంతులేని పుణ్యాలు చేసి, అమితమైన తపస్సు చేసి ఇంద్రపదవి సంపాదించాను. ఇంద్రపదవి రాగానే పొగరు తలకెక్కి బ్రాహ్మణులను అవమానించాను. అగస్త్యుడనే ముని నా మీద ఆగ్రహించి, పాముపు కమ్మని శపించాడు. అయితే ఆ ముని అనుగ్రహంతోనే నాకు పూర్వస్మృతీ, అంతులేని బలమూ కలిగాయి. ఎవరు నా ప్రశ్నలకు సరి అయిన సమాధానాలిచ్చినా నాకు శాప విముక్తి కలిగేటట్టు కూడా ఆయనే అనుగ్రహించాడు," అని సర్పం అన్నది.

"అలా అయితే నా శక్తికి తగినట్టుగా సమాధానాలిస్తాను. నీ ప్రశ్నలు అడుగు," అన్నాడు ధర్మరాజు.

"బ్రాహ్మణుడంటే ఎలాటివాడు? అతను తెలుసుకోదగినది ఏది?" అని సర్పం అడిగింది.

"నాకు తోచిన సమాధానం చెబుతాను. ఎవడిలో సత్యమూ, దానమూ, ఓర్పూ, తపస్సూ, దయా, కనికరమూ ఉంటాయో వాడు బ్రాహ్మణుడు. వాడు తెలుసుకోదగినది ఏదంటే, దుఃఖం లేనిదీ, సుఖం లేనిదీ అయిన పరబ్రహ్మం," అన్నాడు ధర్మరాజు.

"రాజా, నువు చెప్పిన గుణాలన్నీ శూద్రుడిలో ఉంటే వాణ్ణి బ్రాహ్మణుడనవచ్చునా? సుఖదుఃఖాలకు అతీతమైన పరబ్రహ్మం అన్నావు గదా, సుఖదుఃఖాలకు అతీతమైనది ప్రపంచంలో ఏదీ లేదా?" అని సర్పం మళ్ళీ అడిగింది.

"సత్వాది గుణాలు శూద్రుడిలో ఉంటే వాడు శూద్రుడు కాడు. అవి లేనివాడు బ్రాహ్మణుడూ కాడు. ప్రవర్తనే సర్వోత్తమ మైనది. శీతోష్ణాల మధ్య మరేదీలేనట్టుగా, సుఖదుఃఖాలకు భిన్నమైనది కూడా లోకంలో ఏదీ లేదు. అలాటి ద్వంద్వాలకు అతీతమైనది పరబ్రహ్మం ఒక్కటే అను కుంటున్నాను," అన్నాడు ధర్మరాజు.

"ప్రవర్తనే అత్యుత్తమమన్నావు గదా, ప్రవర్తన చేతనే ఎవడైనా బ్రాహ్మణుడయే టట్టుంటే వర్ణాశ్రమాల ఏర్పాటు వృథాయే గదా?" అని సర్పం అడిగింది.

దానికి ధర్మరాజు, "మాట్లాడటమూ, పుట్టటమూ, చావటమూ, బిడ్డలను కన టమూ సర్వమానవులకూ సమానమే. అయితే పూర్వం ప్రమాదవశాన జాతిసాంక ర్యం కలిగిన కారణంచేత వర్ణవిభజన అవ సరం అయింది. అంతేగాని, వేదాలు తెలి సినవారికి ప్రవర్తనే ప్రధానం. బ్రాహ్మణ స్త్రీకి పుట్టినవాడు వేదసంస్కారం పొందే వరకూ శూద్రుడితో సమానుడే. తరవాత వాడు సత్వాది గుణాలు అలవరచుకుని బ్రాహ్మణుడవుతాడు. అలాటి గుణాలు గల శూద్రుడు సచ్ఛూద్రుడని స్వాయంభువ మనువు పూర్వం చెప్పాడు," అన్నాడు.

అప్పుడు సర్పం, "నీ సమాధానాలకు సంతోషించాను. నీ తమ్ముణ్ణి నేను కబ



ళించను," అంటూ శాపం వదిలి, పూర్వపు నహుష రూపం పొందింది. అంతలో స్వర్గం నుంచి విమానం రాగా, నహుషుడు అందులో ఎక్కి స్వర్గానికి వెళ్ళిపోయాడు. తరవాత ధర్మరాజు భీముణ్ణి వెంటబెట్టు కుని, ధౌమ్యుడితో సహా తమ పర్ణశాలకు తిరిగివచ్చి, మిగిలినవాళ్ళకు జరిగినది చెప్పాడు.

"భీముడికి ఈ దుస్సాహస మేమిటి? ధర్మరాజు ఎంత జ్ఞాని!" అని అందరూ ఆశ్చర్యపడ్డారు.

పాండవులు వర్షాకాలం వెళ్ళిపోయేదాకా ద్వైతవనంలోనే ఉండి, తమ వెంట బ్రాహ్మణులనూ, పరివారాన్నీ తీసుకుని



బయలుదేరి కామ్యకవనానికి చేరుకున్నారు. అక్కడి ఋషులు వారిని చక్కగా ఆదరించారు.

ఇంతలో పాండవులను చూడటానికి సత్యభామతో సహా కృష్ణుడు వారున్న చోటికి వచ్చాడు. అతను, పాండవులందరూ వింటూ ఉండగా, ధర్మరాజుతో, "రాజా, నువు ఇంతకాలం అడవులలో నివసించి కూడా ఆటవికధర్మాలు అవలంబించక రాజధర్మాన్ని నిలిపావు. ధర్మరాజు అనే పేరు నీకు సార్థకమయింది. మీ నియమకాలం గడవగానే నీ శత్రువులను యముడి వద్దకు పంపటానికి మేమంతా తోడువస్తాము. నువు వైభవంగా రాజ్యమేలుతావన్నది నిశ్చయం," అని, ద్రౌపదితో, "పాంచాలీ, దుర్యోధనుడు మొదలైనవారికి కాలం మూడింది. నీ బిడ్డలను సుభద్ర చక్కగా చూసుకుంటున్నది. ప్రద్యుమ్నుడు వారికి విలువిద్యలు నేర్పుతున్నాడు," అన్నాడు.

ధర్మరాజు కృష్ణుడికి నమస్కరించి, "నువే మాకు దిక్కు. అరణ్యవాసం అయిపోవచ్చింది. నీ దయవల్ల అజ్ఞాతవాసం కూడా పూర్తి చేశామంటే, అటు తరవాత మేము ఏం చెయ్యాలో నువే ఆజ్ఞాపింతువుగాని," అన్నాడు.

కృష్ణుడు పాండవుల వద్ద ఉండగానే అక్కడికి మార్కండేయుడు వచ్చాడు. ఆయన వయసు చాలా దీర్ఘమైనది. కాని చూడటానికి ఇరవైయేళ్ళవాడిలాగా కనిపిస్తూ, గొప్ప తేజస్సుతో వెలిగిపోతూండేవాడు. మార్కండేయుడు అక్కడ చేరినవారికి అనేక కథలూ, అనుసరించవలసిన ధర్మాలూ చెప్పాడు.

ఆశ్రమం వెలపల ఈ గోష్ఠి సాగుతూ ఉండగా ఆశ్రమం లోపల సత్యభామా, ద్రౌపదీ ఏకాంతంగా కూర్చుని కబుర్లు చెప్పుకున్నారు.

ఆ సమయంలో సత్యభామ ద్రౌపదితో, "నీ భర్తలు దిక్పాలకులకు తీసిపోనివారు గదా, అలాంటివారు అయిదుగురూ నీకు వశులై, ఎన్నడుగాని నీకు అయిష్టం కలగ

కుండా, ఎంతో ఆదరంగా చూడటానికి ఏమిటి కారణం? వారిని వశపరచుకోవ టానికి నేము లేవైనా నేచావా? మంత్రాలూ, మూలికలూ మొదలైన వశీకరణాలు ప్రయో గించావా? ఆ రహస్యం ఏమిటో నాకు కూడా కాస్త చెప్పావంటే, నేను కూడా నా భర్తను వశపరచుకుంటాను,'' అన్నది.

దానికి ద్రౌపది, ''సత్యభామా, నువు చెప్పే వశీకరణ మార్గాలు చెడ్డస్త్రీలు అవ లంబించేవి. కృష్ణుడి వంటివాడికి భార్యవైన నువు ఇలా అడగటమే తప్పు. నన్ను గురించి నీకు సందేహం రావటం కూడా తప్పే. తన భార్య మందులూ, మంత్రాలూ ప్రయోగిస్తుందని తెలిసినాక మగవాడు ఆమెను విషసర్పాన్ని చూసినట్టు చూడడా? పాండవులు నా పట్ల ప్రేమగా-ఉండటానికి కారణాలు చెబుతాను విను. నేను లేనిపోని కోరికలు కోరి, అవి తీర్చకపోతే అలిగి కూర్చోను. భర్తలకు నా మీద విశ్వాసం ఉన్నది గదా అని వారికి జరగవలసిన ఉపచారాల విషయంలో అశ్రద్ధ చెయ్యను. వారి సేవలు నేనే చేస్తానుగాని, పని మను షులచేత చేయించను. వారికి ఇష్టమైన వంటలు నాచేతి మీదుగా చేసి, నేనే పెడ తాను. వారు చెప్పేదానికీ, చేసేదానికీ నేనె న్నడూ ఎదురు చెప్పను. అకారణంగా నవ్వను. నా సవతులను చూసి అసూయ




పడను. ధర్మరాజు ఇంద్రప్రస్థంలో రాజ్యం చేసే కాలంలో రోజూ అనేక వేలమంది బ్రాహ్మణులూ, బ్రహ్మచార్లూ, సన్యాసులూ అతిథులుగా ఉండేవారు. వారికి అన్నీ సక్రమంగా జరిగినదీ, లేనిదీ నేనే స్వయంగా చూసేదాన్ని. అంతేకాదు, పాండవుల ఇతర భార్యలూ, లక్షలాది దాసీజనమూ, పశువుల కాపర్ల దగ్గిర నుంచీ ఎందరో ఉండేవారు; ఆ అందరి యోగక్షేమాలూ నేనే చూసే దాన్ని. చివరకు బొక్కసం జమా ఖర్చులు కూడా నేనే చూసేదాన్ని. కుటుంబ భార మంతా నేనే మోసేదాన్ని. అందుకనే నా భర్తలకు నాపైన అంత విశ్వాసమూ, స్నేహమూనూ. అంతేగాని మందులూ,

మాకులూ, మంత్రాలూ, తంత్రాలూ నా వద్ద ఏమీ లేవు," అన్నది.

సత్యభామ ఈ మాటలు విని, "నిన్ను ఇలా అడిగినందుకు నాకు చాలా పశ్చాత్తాపం కలుగుతున్నది. నా మీద కోపం ఉంచకు. నవ్వులకు అడిగాననుకో," అన్నది.

తరవాత మార్కండేయ మహామునీ, సత్యభామా కృష్ణులూ పాండవుల వద్ద సెలవు తీసుకుని, ఎవరిదారిన వారు వెళ్ళిపోయారు. అప్పుడే పాండవులు కూడా కామ్యకవనాన్ని వదిలిపెట్టి తిరిగి ద్వైతవనానికి వచ్చి, ఒక అందమైన ప్రదేశంలో, ఒక సరస్సుతీరాన పర్ణశాల నిర్మించి, అందులో కాపరం పెట్టారు.

పాండవులు ద్వైతవనంలో ఉంటూ ఉండగా ఆ వనంలో ఉండే ఒక బ్రాహ్మణుడు హస్తినాపురానికి వెళ్ళి, ధృతరాష్ట్రుణ్ణి కలును కుని, "మహారాజా, నేను ద్వైతవనం నుంచి వస్తున్నాను. అక్కడ పాండవులు చలికీ, వేడికీ, గాలికీ కూడా గురి అయి నానా అవస్థలూ పడుతున్నారు. లోకాలను జయించగల అయిదుగురు భర్త లుండి కూడా ద్రౌపది అనాథ లాగా అగచాట్లు పడుతున్నది," అన్నాడు.

ఈ మాట విని ధృతరాష్ట్రుడు లోలోపల కుమిలిపోయాడు. ఎందుకంటే, పాండవుల పాట్లన్నిటికీ తన ఉపేక్షే కారణమని అయనకు తెలుసు. ఆయన ఆ బ్రాహ్మణుడితో, "నా కొడుకు లందరి కన్న కూడా ధర్మరాజు ఉత్తముడు. అతని మనసులో కోపం అనేది ఉండదు. అర్జునుడు ధర్మరాజుకు విధేయుడు. భీముడు అలా కాదు. అతను మహాబలుడు. అతని మనసులో కోపం ఎప్పుడూ ఉంటుంది. అయితే ధర్మరాజు మాటకు కట్టుపడి ఆ భీముడు విజృంభించకుండా అణిగి పడిఉన్నాడు. ఇంతకూ నా కొడుకు దుర్యోధనుడు దుష్టబుద్ధి గలవాడు. వాడి దుర్మార్గమే ఇన్ని కష్టాలకూ కారణం. రేపు వాడు ఆ పాండవులకు అర్ధరాజ్యం ఇస్తే ఏ బాధా వుండదు. కాని వాడివ్వడు. అది వాడి స్వభావానికి విరుద్ధం," అంటూ పెద్దగా నిట్టూర్పులు విడిచాడు.





# శివపురాణం

## 9

నందీశ్వరుడు శివుడు కోరిన ప్రకారం సప్తమహర్షులను వెంటబెట్టుకుని కైలాసానికి తిరిగి వచ్చాడు. వాళ్ళు శివదర్శనం కలిగినందుకు సంతోషించి, "మా వలన కావలసిన కార్య మేమిటో సెలవిస్తే, చెయ్యటానికి సిద్ధంగా ఉన్నాము," అన్నారు.

"మహామునులారా, నేను పార్వతిని వివాహం చేసుకుని, గృహస్థుగా ఉండ నిశ్చయించాను. అందుచేత మీరు మేనకా హిమవంతుల వద్దకు వెళ్ళి, వారి కుమార్తె అయిన పార్వతిని నా కిచ్చి పెళ్లిచేసే లాగు మంచి మాటలతో ఒప్పించి, ముహూర్తం పెట్టి, నా వివాహం జరిపించండి," అన్నాడు శివుడు సప్తమహర్షులతో.

సప్తమహర్షులు అందుకు సంతోషంగా ఒప్పుకుని హిమవంతుడు ఉండే చోటికి వచ్చారు. మేనకా హిమవంతులు వారికి ఆదరంతో అతిథిసత్కారాలు చేసి, "ఏ పని మీద మీరు మా గృహం పావనం చేశారో సెలవిస్తే, మీరు చెప్పినది చేస్తాం," అన్నారు.

దానికి సప్తమహర్షులు, "మేనకా హిమవంతులారా! మీ అదృష్టం చాలా గొప్పది. సాక్షాత్తూ పరమేశ్వరే మీ కడుపున పార్వతిగా పుట్టింది. ఆమెను శివుడు ఇప్పుడు వివాహమాడ గోరుతున్నాడు. ఈ పెళ్ళితో మీ కీర్తి ముల్లోకాలు వ్యాపిస్తుంది," అన్నారు.

ఆ మాటలు విని మేనకా హిమవంతులు, "మహర్షులారా, మేము కూడా పార్వతిని శివుడికి ఇచ్చి పెళ్ళిచేయాలనే అభిప్రాయంతోనే ఉన్నాము. కాని నిన్న ఒక భిక్షువు మా వద్దకు వచ్చి, పార్వతిని శివుడికి ఇయ్యవద్దనీ, శివుడికి ఒక రాజ్యం గాని, సుఖం గాని, భోగం గాని లేవనీ, శ్మశానాలలో నివసిస్తాడనీ, పాములను ధరించి, సరిఅయిన

అట్ట చివరి బొమ్మ



భోజనపాత్ర కూడా లేక కపాలంలో తిండి తింటాడని చెప్పి వెళ్ళిపోయాడు. అందుచేత పార్వతిని శివుడి కిచ్చి పెళ్ళిచేసే ఆలోచన మానుకున్నాం," అన్నారు.

ఈ మాట విని సప్తమహర్షులు అమితాశ్చర్యం పొంది, "ఆ భిక్షువు ఎవడో దుర్మార్గుడై వుంటాడు. శివపార్వతుల పెళ్ళి చెడగొట్టటానికి మీతో అలా చెప్పి ఉంటాడు. మీ కుమార్తె ఆ పరదేవత అవతారమని మరవకండి. ఈమె శివుడి భార్య కావటానికే మీ కుమార్తెగా పుట్టింది," అన్నారు.

వసిష్ఠమహాముని మేనకా హిమవంతులకు ఈ సందర్భంలో అనరణ్యు డనే రాజు కథ చెప్పాడు.

ఇంద్రసావర్ణి అనే పధ్నాలుగో మనువు వంశంలో అనరణ్యు డనే రాజు చక్రవర్తిగా రాజ్యపాలన చేసేవాడు. అయనకు రుచి అనే తపశ్శాలి పురోహితుడుగా ఉండేవాడు.

ఆ రాజుకు అయిదుగురు భార్యలూ, నూరుమంది కొడుకులూ, అందరి తర్వాత పద్మావతి అనే కుమార్తే ఉండేవారు. పద్మావతి గొప్ప సౌందర్యవతి. యౌవనం రాగానే అనరణ్యుడు ఆమెకు తగిన రాజకుమారుడి కోసం అన్వేషణ ప్రారంభించాడు.

ఇలా వుండగా ఒకనాడు పద్మావతి తన పరిచారికలతో సహా నదికి వెళ్ళి స్నానం చేస్తూండగా, పిప్పలాదు డనే మహాముని స్నానం కోసం అక్కడికే వచ్చాడు. పిప్పలాదుడు సామాన్యుడు కాడు, భృగువంశాన పుట్టినవాడు; దధీచి మహాముని కొడుకు.

అటువంటి పిప్పలాదుడు పద్మావతి అందం చూసి మోహించి, అనరణ్యుడి సభకు వెళ్ళి, తనకు పద్మావతిని భార్యగా ఇచ్చి వివాహం చెయ్యమని కోరాడు.

రాజుకు నోట మాట రాలేదు. రతీదేవి లాటి తన కుమార్తెను మన్మధుడి వంటి ఏ రాజకుమారుడికో ఇవ్వాలని ఆయన అనుకుంటూ వుండగా, ఈ ముసలివాడు ఎక్కడినుంచో ఊడిపడ్డాడు. "నా కుమార్తెను నీకు భార్యగా ఇవ్వను!" అంటే శపించి, వంశనిర్మూలనం చేస్తాడేమో!

ఇలా రాజు సంశయావస్థలో పడి కొట్టు కుంటూవుండగా రాజపురోహితుడూ, మంత్రులూ ఆయనకు ధైర్యం చెప్పి, ఇలా సలహా ఇచ్చారు :

"మహారాజా, పద్మావతి వంటి స్త్రీ ఈ మహాముని వంటి భర్తను పెళ్ళాడగోర వచ్చును. ఈయన గొప్ప వంశాన పుట్టిన వాడు, కులశ్రేష్ఠుడు. అలాటివాడికి కన్యను ఇవ్వటం గొప్ప విషయమే. ఈయనను పద్మావతికి చూపి ఆమె వివాహానికి అంగీక రించే పక్షంలో ఇద్దరికీ వివాహం చేసెయ్యి. ఆమె అంగీకరించని పక్షంలో ఈ మునీశ్వ రుడు వెళ్ళిపోతాడు."

అనరణ్యుడికి పెద్ద బెడద తీరింది. పిప్పలాదుణ్ణి చూసి పద్మావతి ఆయనకు భార్యకావటానికి సమ్మతించింది. అన రణ్యుడు వారిద్దరికీ పెళ్ళిచేసి గొప్ప కీర్తి సంపాదించుకున్నాడు.

వివాహం కాగానే పిప్పలాదుడు పద్మా వతిని తన వెంట ఋషిపల్లెకు తీసుకు పోయాడు. కుమార్తెపై గల ప్రేమచేత అన రణ్యుడు కూడా, తన రాజ్యాన్ని పెద్దకొడుకు పరం చేసి, అయిదుగురు భార్యలనూ వెంట బెట్టుకుని, కుమార్తె ఉన్న చోటికే వాన ప్రస్థం వెళ్ళాడు.

ఒకనాడు పద్మావతి నదిలో స్నానం చెయ్యటానికి వెళ్ళేసరికి, ధర్మదేవత నవ



మన్మథుడైన యువకుడి రూపంలో ఆమె వద్దకు వెళ్ళి, "సుందరీ, నీ అందానికి తగినవాణ్ణి నేను. ఆ ముసలిభర్తతో కాపరం చేస్తూ నీ యౌవనాన్ని అడవిగాసిన వెన్నెల చేయక, నా వెంట నా రాజ్యానికి వచ్చి, మహారాణి లాగ జీవించు," అన్నాడు.

పద్మావతి ఆగ్రహావేశంతో, "నా భర్తను నిందించిన నువు క్షయమై పోవుదువుగాక!" అని శపించింది.

ధర్మదేవత అదిరిపడి, "అమ్మా, నేను రాజును కాను, ధర్మదేవతను! నీ పాతి వ్రత్యం పరీక్షించ వచ్చాను. నన్ను మన్నించి, శాపం ఉపసంహరించు," అని వేడుకున్నాడు.

పద్మావతి కూడా తెలియక చేసిన తప్పుకు నొచ్చుకుని, "శాపం ఉపసంహరించడం నాకు సాధ్యంకాదు. ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క పాదాన్ని పోగొట్టుకుంటూ సంచరించు," అన్నది.

వసిష్ఠుడు పద్మావతి కథ చెప్పి, "మేనకా హిమవంతులారా, మీరు కూడా అనరణ్యుడు చేసినట్టే, మీ కుమార్తెను శివుడి కిచ్చి పెళ్లి చెయ్యండి," అన్నాడు.

మేనకా హిమవంతులు తృప్తిపడ్డారు. మైనాకుడు మొదలైన బంధువులు కూడా శివపార్వతుల వివాహానికి సుముఖులయారు.

అప్పుడు మేనకా హిమవంతులు పార్వతి చేతిని అరుంధతీ వసిష్ఠుల చేతిలో పెట్టి, "మీ యిష్టప్రకారమే ఈ పిల్లను శివుడి కిచ్చి వివాహం చేద్దాం. పెళ్ళికి ముహూర్తం నిశ్చయించండి," అన్నారు.

అరుంధతి పార్వతిని లోకమాత కమ్మని ఆశీర్వదించింది. మాఘ శుద్ధ ఏకాదశినాడు ఆరుద్ర నక్షత్ర మందు వృశ్చికలగ్నం ముహూర్తం పెట్టి, ఆ రోజు తెల్లవారు ఝామున శివపార్వతుల పెళ్ళి జరపటానికి నిర్ణయం జరిగింది.

సప్తమహర్షులు శివుడి వద్దకు తిరిగి వచ్చి, పని సానుకూల మయిందని తెలిపారు. వారు పెళ్ళిపనులు చేయటానికి బ్రహ్మ, విష్ణు, ఇంద్రాదులను నియోగించమని సలహా ఇచ్చి వెళ్ళిపోయారు.

పార్వతి వివాహానికి కావలసిన ఏర్పాట్లన్నీ సక్రమంగా జరిగాయి. సంబారాలన్నీ సమకూర్చారు. హిమవంతుడు తన మంత్రుల చేత పనులన్నీ చేయించాడు. శుభలేఖలు బంధువు లందరికీ వెళ్ళాయి. పార్వతిని పెళ్ళికూతుర్ని చేయటానికి పట్టణంలో గల ముత్తయిదువు లందరూ వచ్చారు.

మంచి ముహూర్తం చూసి పార్వతికి మంగళస్నానం చేయించి, సాంబ్రాణి ధూపం వేసి, పట్టుబట్టలు కట్టబెట్టి, అలంకారాలు పెట్టి, ఆమెకు పునుగూ, జవ్వాదీ, హరిచందనమూ పూసి, నుదుట కస్తూరిబొట్టు పెట్టి, పుష్పహారాలు వేసి, పెళ్ళికూతుర్ని చేసి ఉత్సవం జరిపారు.



# 119. ఫాతిమా ఆలయం

ఇరాన్‌లోని బఖ్తియార్‌జాతుల ప్రాంతంలో కుమ్ అనే పట్టణంలో ఈ ఫాతిమా గుడి ఉన్నది. ఫాతిమా షియాముస్లిములకు అరాధ్యురాలు. ఆమె క్రీ. శ. 816లో పరమపదించింది. ఇది ఆమె సమాధి. అక్కడికి వచ్చే భక్తులలో స్త్రీలు హెచ్చుగా ఉంటారు. పర్షియాకు రాజు కావటం జరిగితే ఈ గుడికి బంగారు తొడుగు వేస్తానని ఒక యువకుడు మొక్కుకున్నాడట. అతని పేరు పత్ అలీషా. అతను పర్షియాను పాలించాడు—గుడికి బంగారు తొడుగు ఉన్నది!



Photo by D. N. Shirke



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఎక్కువైన బుద్ధి

పంపినవారు :
వి. వీరాస్వామి

Photo by D. N. Shirke



రామిరెడ్డిపేట,
నరసరావుపేట

పెక్కు కార్యసిద్ధి

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు అక్టోబర్ నెల 10 వ తేదీ లోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు డిసెంబర్ సంచికలో ప్రకటించబడును.

# చందమామ

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు


| | | | | |
|---|---|---|---|---|
| లలాట రేఖ | .... 3 | | సజ్జనుడిపాట్లు-2 | .... 33 |
| రత్నాల చెట్లు | .... 5 | | కీర్తికి దారి | .... 41 |
| రాతిరథం - 13 | .... 9 | | శాస్త్రిగారి కోడళ్ళు | .... 45 |
| గుణం ప్రధానం | .... 17 | | మహాభారతం | .... 49 |
| పానకంలోపుడక | .... 23 | | శివపురాణం | .... 57 |
| పాముతో చెలగాటం | .... 29 | | ప్రపంచపు వింతలు | .... 61 |


రెండవ అట్ట:
మీనాక్షి ఆలయం, మధుర

మూడవ అట్ట:
బౌద్ధాలయం, గయ


Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

# ఏనుగును తినడం ఎలాగ



## ఔను ఔను ఏనుగే!

ఏనుగులు తియ్యగా గరగరలాడుతూ
తినడానికి పసందుగావుంటాయి.
అతి సులభంగా జీర్ణమవుతాయి కూడా.
అల్లాగే వుంటాయి
పులులు, సింహాలు,
జిరాఫీలు, హిపపొటమస్సులు,
కంగారులు, కుందేళ్లు, ఒంటెలు
ఒక పేటెంట్ బ్రిటానియా బిస్కట్ల
కంపెనీవారు తయారుచేసేవి—
అన్నీ. అవి బ్రిటానియా
బిస్కట్ల రూపంలో ఉంటాయి.
నోటిలో వేసుకోడానికి
అనువుగా వుండి ప్రతివారికి
విందు కొల్పిస్తాయి. మీరు
వాటిని తిని ఆనందించండి.
జూనంతా మింగేయవచ్చు!
కొను బ్రిటానియా జూ.






# బ్రిటానియా జూలాజికల్ బిస్కట్లు

భారతదేశంలో అతి శ్రేష్ఠమైన బిస్కట్లు **బ్రిటానియా**

BBC-2769

FOR BLACK HAIR
AND WHITE TEETH
SEVASHRAM'S
COW BRAND




BRAHMI AMLA HAIR OIL
AND BLACK
TOOTH POWDER





AYURVED SEVASHRAM PVT. LTD. UDAIPUR · VARANASI · HYDERBAD.

# బాటా వేఫైండర్స్

## స్కౌట్లను, గైడ్లను సాహసమైన పనులకు పురికొల్పేలాంటి చేత

భారత్ స్కౌట్స్ & గైడ్స్‌వారి అనుమతి పొందిన జోళ్లు ఇవి మాత్రమే.

మేక, ఉడత, గొర్రె, నక్క, కుక్క, సిటి కుక్క, గుర్రం, పిల్లి, లేడి, కుందేలు

● జంతువుల జాడను గుర్తించి తెల్సుకొనేలా పది రకాల పాదాల గుర్తులు సోలు అడుగున అచ్చుపోసారు. ● ఓ అయస్కాంత దిక్సూచి జోడులోని ఓ రహస్య సంధిలో వుంది.











యూనిఫారమ్‌తో తొడుక్కొనేలా ప్రత్యేకం డిజైన్ చేయబడిన యీ బాటా వేఫైండర్స్ సోలు దీర్ఘ కాలం మన్నుతుంది. పైభాగాన్ని మెత్తని చర్మంతో చేసారు. నఖ శిఖ పర్యంతం టిప్ టాప్‌గా వుంటండి. నేడే ఓ జత వేఫైండర్స్‌ను కొనుక్కోండి. జూనియర్ మరియు సీనియర్ సైజులు: రూ 22.95—26.95

బడి పిల్లలకు సరైన జోడు **Bata**

ఎలప్రాయంలోనే
అతనికి
నేర్పండి



# నియమానుసారం ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుతో పళ్లు తోముకుంటే ఇగుళ్ల బాధలను, దంతక్షయాన్ని అరికట్టుతుంది.




ఫోర్‌హాన్స్ పళ్లనూ, ఇగుళ్లనూ కూడా రక్షిస్తుంది. ఇది దంతవైద్యునిచే సృష్టించబడింది. ఇగుళ్ల రక్షణకై ప్రత్యేకమైన పదార్థాలు దీనిలో ఉన్నాయి. నియమానుసారం, రాత్రి, ప్రొద్దుట, ఫోర్‌హాన్స్‌తో పళ్లు తోముకుంటే, ఇగుళ్ల బాధలు, దంతక్షయము మీ దగ్గరకు రావు. మీ బిడ్డకు ఈ ముఖ్య విషయం నేర్పటానికి ఇదే మంచి తరుణం. క్రొత్త విషయాలు నేర్చుకోవాలనే ఉత్సుకత ఉన్నప్పుడే నేర్పటం ఉత్తమం. కావున, నేడే ప్రారంభించండి.

ఫోర్‌హాన్స్ దంతసంరక్షణ ఎంత చిన్న వయసులో నేర్పితే అంత ఉత్తమం.

**ఉచితము** "దంతములు ఇగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అను వివరణాత్మకమైన చిన్న రంగుల పుస్తకము. ఇది పది భాషలలో*. మానర్స్ డెంటల్ అడ్వయిజరీ బ్యూరో, పోస్ట్ బ్యాగ్ 10031, బొంబాయి-1 వారి వద్ద దొరకును.

పేరు ____________ వయస్సు ____________

చిరునామా ____________



* పోస్టు ఖర్చులకై, 20 పైసల తపాలా బిళ్లలు పంపండి. ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉర్దూ, బెంగాలీ, తమిళం, తెలుగు, మలయాళం, కన్నడ భాషలలో ఏది కావాలో రాస్తూ, దాని క్రింద గీతగీయండి.

ఫోర్‌హాన్స్
దంతవైద్యునిచే
సృష్టింపబడిన
టూత్‌పేస్టు

'C. 1'

89F 182 Tel

# ఫాస్‌ఫోమిన్® తో శక్తిని పొందండి

వర్షాకాలములో ఆనందముగా ఉండండి. వానలో శేక కుండ పోతగా వర్షము కురుస్తున్నా బాధే అనిపించదు. మీరు ఫాస్‌ఫోమిన్ త్రాగుతే ఎంతో ఆనందముగా ఉంటుంది. ఫాస్‌ఫోమిన్ శక్తిని పెంపొందించును, అలసట నిరుత్సాహములను పోగొట్టును, ఆకలిని అధికము చేయును, శరీరము యొక్క రోగనిరోధక శక్తిని ఎక్కువ చేయును.

ఫాస్‌ఫోమిన్‌ను కొనండి. అది బి కాంప్లెక్స్ విటమిన్లు మరియు మల్టిపుల్ గ్లిసరోఫాస్ఫేట్లు గల అనుభవజ్ఞుల సంస్థ రుచిగల టానిక్కు. మీ కుటుంబమునకు ఫాస్‌ఫోమిన్‌ను రోజూ యివ్వండి. అది అన్ని కాలములలోను వాడదగిన విటమిన్ టానిక్కు.






**కుటుంబము అంతటికి ఫాస్‌ఫోమిన్ వల్ల ఆరోగ్యము కలుగును**

SQUIBB **Sarabhai Chemicals**

® ఇ.ఆర్. స్క్విబ్ & సన్స్ ఇన్‌కార్పొరేటెడ్ వారి రెజిష్టర్డ్ ట్రేడ్ మార్కుకు చిహ్నం. దాని లైసెన్సుడు ఉపయోగదారులు కరంచంద్ ప్రేంచంద్ ప్రైవేట్ లిమిటెడ్

Shilpi/HPMA 14A/71 Tel

